ర్యానుజ్ఞయా కుర్యాచ్ఛాస్త్రదృష్టేన వర్త్మనే''తి। ''కాలేష్వపి చ సర్వే
ష్వి'' త్యాదిప్రసిద్ధం । తతోఽన్యత్ర సర్వత్ర భయాతిశయం వ్యంజయితుం
త్వత్పాదమూలమిత్యుక్తం। పరమప్రాప్యస్యత్వైవ పాదమూలం ప్రవిష్టా
నామేవాపునరావృత్తిగతస్తద్ధారణం మేఫలమిత్యపి సూచ్యతే । అనన్యగ
తిరిత్యేతత్సామర్థ్యాచ్ఛతత్సిద్ధిః । 'ముముక్షుర్వై శరణమహం ప్రపద్య'ఇతి
శ్రుత్యుక్తమహాశరణం ప్రపద్య ఇతి । ఏతావతా స్వనిష్ఠావచనేన మంత్రే
పూర్వఖండశ్శబ్దతోఽర్థతశ్చ దర్శితః । ప్రపత్తిప్రకరణే శరణశబ్ద ఉపాయపర
ఇత్యహిర్బుధ్న్యసంహితాయాముక్తం ''ఉపాయే గృహరక్షిత్రోశ్శబ్దశ్శ
రణమిత్యయం। వర్తతే సాంప్రతం త్వేష ఉపాయార్థైకవాచక''ఇతి । ప్ర
పత్తిప్రయోగశ్చైవం ప్రదర్శితః। ''అహమస్మ్యపరాధానామాలయోఽకిం
చనోఽగతిః । త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతి
రిత్యుక్తా సా దేవేఽస్మిన్ ప్రయుజ్యతా''మితి । తన్మాహాత్మ్యం చైవం ప్రకాశి
తం ''అనేనైవం ప్రపన్నస్య భగవంతం సనాతనం । తస్యానుబంధాః పా
ప్మానస్సర్వే నశ్యంతి తత్క్షణాత్ । కృతాన్యనేన సర్వాణి తపాంసి తప
తాం వర । సర్వతీర్థాస్సర్వయజ్ఞాస్సర్వదానాని తత్క్షణాత్ । కృతాన్యనేన
మోక్షశ్చ తస్య హస్తే న సంశయ''ఇతి । సకలఫలసాధనత్వం చోక్తం ''య
ద్యేన కామకామేన న సాధ్యం సాధనాంతరైః । ముముక్షుణా యత్సాంఖ్యేన
యోగేన న చ భక్తితః । ప్రాప్యతే పరమం ధామ యతో నావర్తతే యతిః ।
తేన తేనాప్యతే తత్తన్న్యాసేనైవ మహామునే । పరమాత్మా చ తేనైవ సా
ధ్యతే పురుషోత్తమ''ఇతి । అత్ర ''అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస
పూర్వకం । తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తిశ్శరణాగతి''రితి భరత
మునిప్రణీతం లక్షణమపి సుసంగతం । ఇహ చానన్యసాధ్య ఇతి ప్రపత్తివ్య
తిరిక్తేన స్వేనాన్యేన చాసాధ్యత్వం ప్రపత్తవ్యస్య సాధ్యత్వం చ వివక్షితం ।
స్వాభీష్ట ఇతి సుఖస్య దుఃఖనివృత్తేస్తత్సాధనానాం చ సంగ్రహః । తత్ర ప్ర
మాణవిరుద్ధం న ఫలం । శరణ్యావిరుద్ధం చానుకూల్యసంకల్పాదినా సంగచ్ఛ
తే। స్వాధికారవిరుద్ధం తు నిపుణస్య స్వాభీష్ట ఇత్యనేన నిరస్తం। ఉపాయలా
ఘవాదిభిరకంపనీయో విశ్వాసో మహావిశ్వాసః। తదేకోపాయతాశబ్దేన ప

శ్చైతస్య యత్నైరపేక్ష్యం చ వ్యజ్యతే । ప్రపత్తిశ్శరణాగతిరితి పర్యాయ
పాఠః। “ఆనుకూల్యస్య సంకల్ప” ఇత్యాదౌ తు షాడ్విధ్యోక్తిరంగాంగిసము
చ్చయాభిప్రాయా । “షడంగం తాముపాయం చే” త్యత్ర షడంగత్వోక్తిర
ష్టాంగయోగవ్యపదేశవత్ అన్యథా నిక్షేపాపరపర్యాయో న్యాసః పం
చాంగసంయుతః। ప్రపత్తిం తాం ప్రయుంజీత స్వాంగైః పంచభిరావృతా”
మిత్యాదిభిర్విరోధప్రసంగాత్ । “ శాస్త్రీయమసంసిద్ధిరియం ప్రపత్త్యాభ
వామి యత్ । పురుషం పరముద్దిశ్య న మే సిద్ధిరితోఽన్యథా । ఇత్యంగముదితం
శేషం ఫలే స్యాత్తద్విరోధినీ ” త్యహిర్బుధ్న్యోక్తమంగాంతరం తు నిశ్శ్రే
యసార్థప్రపత్తినియతం। అంగినశ్చాత్ర భరన్యాసరూపత్వం “ఆత్మాత్మీయ
భరన్యాసో హ్యాత్మనిక్షేప ఉచ్యతే”ఇతి నిర్ధారితం । తదిహ పూర్వశ్లోకస్థన
మః ప్రయోగేణానుకూల్యసంకల్పః ప్రాతికూల్యవర్జనే దర్శితే। న ధర్మనిష్ఠ ఇ
త్యాదిభిరకించనాధికారత్వం కార్పణ్యరూపమంగం చ । రక్షిష్యతీతి విశ్వా
సస్తు శరణ్యేతి సంబుధ్యా వ్యజ్యతే । రక్షణసమర్థః కారుణికశ్చ శరణ్యః స చ
ప్రపన్నం మాం రక్షిష్యతీతి విస్రంభణీయః। సోపసర్గధాతువిశేషశ్చాత్ర
ధ్యవసాయవైశిష్ట్యం వ్యనక్తి। త్వత్పాదమూలం శరణం ప్రపద్య ఇత్యనేనైవ
గోప్తృత్వవరణాత్మనిక్షేపః సిద్ధః । ప్రార్థనాన్వితో హి భరన్యాసః ప్రప
త్తిః భిక్షాదిమాత్రే ప్రార్థనాయామాజ్ఞాదిపూర్వకభరన్యాసే చ ప్రపత్తి
శబ్దప్రయోగదర్శనాత్ । న చాత్ర గురులఘువికల్పానుపపత్త్యా ప్రపత్తేర్భ
క్త్యంగత్వం శంకనీయం స్వాధ్యాయాదివికల్పవదధికారభేదేన వ్యవస్థాపనాత్॥
ప్రణామవినయాదత్ర ప్రపత్తేస్తత్త్వవేదిభిః । యథాధికారమంగత్వం స్వ
తంత్రత్వం చ దర్శితం॥ అత్ర ప్రపద్య ఇతి వర్తమానవ్యపదేశశ్చ ‘ బహిర్ద్రే
వసదనం దామీ’ త్యాదివదనుష్ఠానకాలాభిప్రాయః॥ ౨౨

న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశో యన్న మయా
వ్యధాయి । సోఽహం విపాకావసరే ముకుంద క్రందా
మి సంప్రత్యగతిస్తవాగ్రే॥ ౨౩

అథ సప్తశ్లోకాః ప్రస్తుతోపాయప్రయోగస్థిరీకరణార్థాః తేషు క్రమాత్ప
రస్య సర్వవిరోధినివర్తనోచితగుణవిశేషత్వం రక్ష్యరక్షకయోరితరేతర

లాభః స్వపరిత్యాగే పరస్యానిష్టప్రసంగః స్వస్యానన్యగతిత్వేన తత్ప్రహా
ణానర్హత్వం శరణ్యస్యభోగ్యతమత్వేన ప్రయోజనాంతర వైముఖ్యం
ఉపాయస్యసౌకర్యంస్వాదుతమత్వంచ తాత్పర్యతః స్థాప్యతే, తథాఽది
మేయద్యప్యేవముపాయపరంపరా నాస్తి తథాప్యుపాయాన సంతిచేత్తద
వలంబనేన క్రమాత్కర్మయోగాదీ నుత్పాద్య మోక్షఫలం లభస్వ కింత
దర్థంప్రపత్త్యేత్యత్ర తస్యాకించనత్వమేవస్థిరీకరోతి ననిందితమిత్యాద్యైన ॥
నిందితంగర్హితం ‘యత్త్వార్యాః క్రియమాణంప్రశంసంతిసధర్మః యద్గ
ర్హంతేసో౽ధర్మ’ ఇత్యాపస్తంబః। అత్రనిందితశబ్దేన కావ్యకర్మాపిసంగృ
హ్యతే ముముక్షాపేక్షయాతస్యాపినిందితత్వాత్ । లోకేసర్వస్మిన్సం
సారిజనే అథవా లోక్యతేనేనేతిలోకః ప్రమాణం తస్మిన్।నాస్తి అప్రా
మాణికమిత్యర్థః । అత్రశాస్త్రరూపప్రమాణవిశేషవివక్షా। సహస్రశ ఇ
త్యసంఖ్యాతావృత్తిపరం ॥ని॥ శతంసహస్రమయుతంసర్వమానంత్యవాచ
కమితిపఠంతి। యత్ శరణాగతపరిత్యాగాద్యపి। తదపివేదనిందితం। య
థాహమనుః ‘‘శరణాగతంపరిత్యజ్య వేదంవిప్లావ్యచద్విజః। సంవత్సరంయ
వాహారస్తత్పాపమవసీదతీ’’తి। ‘‘బాలఘ్నాంశ్చకృతఘ్నాంశ్చవిశుద్ధానపి
ధర్మతః। శరణాగతహంతౄంశ్చస్త్రీహంతౄంశ్చనసంవసే’’దితి। రఘు
శ్చరాక్షసంప్రత్యాహ ‘‘శక్తో౽పిరక్షణేలోభాద్భయాద్వా శరణాగతం।
యస్త్యజేత్పురుషోలోకే బ్రహ్మహత్యాంసవిందతి । ప్రాయశ్చిత్తైనశు
ధ్యంతిమహాపాతకినో౽పిహి।శరణాగతంహంతౄణాంశుద్ధిఃక్వాపినవిద్య
తే। పూయంతేహయమేధేనమహాపాతకినో౽పిహి। శరణాగతహంతారో
నత్వేవరజనీచర।అపిచేత్సుదురాచారః కేనాపినరకాత్ప్రమాన్। ముచ్యతే
నతుపాపాత్మా శరణాగతహింసక’’ ఇత్యాదిబ్రహ్మణాచగీతం।బృహస్పతి
రువాచ ‘‘నచాస్యబీజంరోహతిరోహకాలేనచాస్యవర్షం వర్షతివర్షకా
లే । భీతంప్రపన్నంప్రదదాతిశత్రవేనసో౽ంతరంలభతేత్రాణమిచ్ఛన్’’।
‘మోఘమన్నం విందతేఅప్రచేతాః స్వర్గాల్లోకాన్నశ్యతిభ్రష్టచేష్టః భీ
తంప్రపన్నంప్రదదాతిశత్రవేనేంద్రాదేవాః ప్రహరంత్యస్యవజ్ర’మితి। ఏ
వం‘‘శాస్త్రైర్మునిస్మృతిదృష్టామహాపాతకినామపి। శరణాగతహంతౄ

స్తునదృష్టానిష్కృతిఃక్వచిత్ । లోభాద్ద్వేషాద్భయాద్వాపియస్త్యజేచ్ఛరణాగతం। బ్రహ్మహత్యాసమంతస్యపాపమాహుర్మనీషిణః" ఇత్యాది ద్రష్టవ్యం । ఆనాచరఘుపతిరభయప్రదానప్రకరణే "ఋషేఃకణ్వస్యపుత్రేణకండునాపరమర్షిణా । శృణుగాథాంపురాగీతాంధర్మిష్ఠాంసత్యవాదినా। బద్ధాంజలిపుటందీనం యాచంతంశరణాగతం । నహన్యాచ్ఛానృశంస్యార్థమపిశత్రుంపరంతప। ఆర్తోవాయదివాదృప్తఃపరేషాంశరణాగతః । అపిప్రాణాన్పరిత్యజ్యరక్షితవ్యఃకృతాత్మనా । సచేద్భయాద్వాలోభాద్వాకామాద్వాపినరక్షతి । స్వయాశక్త్యాయథాసత్యంతత్పాపంలోకగర్హితం। వినష్టఃపశ్యతస్తస్యరక్షిణశ్శరణాగతః।ఆదాయసుకృతంతస్యసర్వంగచ్ఛేదరక్షితః । అస్వర్గ్యంచాయశస్యంచబలవీర్యవినాశన"మితి। ఏవంవిధశరణాగతపరిత్యాగాద్యపియన్మయానకృతంతన్నాస్తి। మయా రాగాదిదూషితచిత్తేన । భోగమరుకాంతారపాంథేనేతిభావః। ఏవమనంతప్రతిబంధకాక్రాంతస్వావస్థామనువదన్ భగవతశ్శరణ్యశ్శరణత్వంచస్వాధ్యవసితముత్తరార్ధేనవ్యనక్తి॥ సోహమితి ॥ అద్యాపితాదృశస్వభావః ప్రాయశ్చిత్తావసరేత్వచ్చోదితేషు తత్తత్ప్రాయశ్చిత్తేష్వప్రవృత్తస్తడిచ్ఛాధికారశకనానుశయానభిజ్ఞశ్చేతిభావః । సంప్రతివిపాకావసరఇత్యన్వయః । ప్రాయశ్చిత్తకాలాతిక్రాంతాదుర్నివారోద్గమానాం ఫలానాంభోగాదన్యేనక్షపయితుమశక్యావస్థాయామిత్యర్థః । ముకుందప్రపన్నానామనాదిప్రవృత్తమపరాధజాత మనాదృత్యముక్తిభూమిప్రదయథోక్తం శ్రీసాత్వతే "దురాచారోపిసర్వాశీకృతఘ్నోనాస్తికఃపురా। సమాశ్రయేదాదిదేవంశ్రద్ధయాశరణంయది । నిర్దోషంవిద్ధితంజంతుంప్రభావాత్పరమాత్మన"ఇతి । శ్రీపుండరీకోపాఖ్యానేచ "అశ్వమేధశతైరిష్ట్వావాజపేయశతేనచ। నప్రాప్నువంతిసుగతింనారాయణపరాఙ్ముఖాః। యేనృశంసాదురాత్మానఃపాపాచారరతాస్తథా। తేపియాంతిపరంధామనరానారాయణాశ్రయా"ఇతి।క్రందామి ఆక్రోశామి । అనేన "గోవిందేతియదాక్రందత్కృష్ణామాందూరవాసినం। ఋణంప్రవృద్ధమివమేహృదయాన్నాపసర్పతీ"తిశరణ్యవాక్యంసూచ్యతే । అగతిః పుణ్యవిపాకాద

పిభృశంభీతతయాపూర్వోక్తానన్యగతిః । ‘తస్మాదపివధ్యం ప్రపన్నం నప్రతిప్రయచ్ఛంతీ’తిసర్వేషాంశరణ్యానాం సామాన్యతః ప్రాప్తం, కింపునః ‘‘విభీషణోవాసుగ్రీవ యదివారావణస్స్వయ’’మిత్యాది వాదినోభవతఇత్యభిప్రాయేణాహం తవేతి। అగ్రే-విశ్వసాక్షాత్కారిణస్తవ సార్వత్రికసన్నిధావిత్యర్థః । సవిగ్రహస్యవా శరణ్యస్యాభిముఖ్యమిహాభిప్రేతం । నహ్యసమర్థానామకారుణికానాంచ సన్నిధౌ విపన్నైరాక్రోష్టవ్యమితి భావః। యద్వాసంసారతంత్రవాహితయా పుణ్యపాపఫలప్రదాతుస్త్వత్తఏవభీతస్త్వదగ్రేక్రందామి। రాగానువృత్తిహేతుభూతపుణ్యఫలాద్భీతిరధికమాక్రోశకారణం। అథవాభక్తియోగమనుష్ఠాయతత్ఫలమలబ్ధ్వానివయుక్తదండస్యతవాగ్రేఆక్రోశనేనాప్యపరాధ్యామీతిభావః । ఏవం పూర్వశ్లోకేసపరికరోపాయాంతరాభావఉక్తః। అత్రతుతన్నిదానమపాయబాహుళ్యమనుసంహితంశరణ్యేత్యుక్తంముకుందేత్యనేనస్థాపితం । తదిహ దుర్విషహసంసారనివర్తనోపాయనైరాశ్యజనితశోకావిష్టశ్శరణ్యగుణాధ్యవసాయవానపవర్గార్థప్రపత్త్యధికారీతిదర్శితంభవతి। తథాచోక్తం ‘‘అహంభీతోస్మిదేవేశసంసారేస్మిన్భయావహే । త్రాహిమాంపుండరీకాక్షనజానేశరణంపరం । వృథైవభవతోయాతాభూయసీజన్మసంతతిః । తస్యామన్యతమంజన్మసంచింత్యశరణంవ్రజ। అథపాతకభీతస్త్వంసర్వభావేనభారత। విముక్తాన్యసమారంభోనారాయణపరోభవ। సర్వయోగ్యమనాయాసమప్రమాదమనూపమం । ప్రణతార్తిహరంవిష్ణుం శరణం గంతుమర్హసీత్యాది ॥ ౨౩

నిమజ్జతోనంతభవార్ణవాంతశ్చిరాయమేకూలమివా
సిలబ్ధః । త్వయాపిలబ్ధంభగవన్నిదానీమనుత్తమంపా
త్రమిదందయాయాః॥ ౨౪

నన్వనాదౌసంసారేసంప్రతికేనవిశేషేణాక్రంద్యత ఇత్యత్రానన్యగతిశ్శరణ్యేత్యుభాభ్యాంసూచితం రక్ష్యరక్షకయోరితరేతరలాభప్రతిబోధస్యాద్యతనత్వమాహ॥నిమజ్జత ఇతి॥ అనాదిప్రవృత్తనిమజ్జనమిదానీమప్యనుపరతమిత్యభిప్రాయేణవర్తమాననిర్దేశః।అనంత-స్వరూపరూపగుణవిభూ

తిభిరపరిచ్ఛేద్యా । సర్వత్రసర్వదాసన్నిహితేహిత్వయి ‘‘ఏషబ్రహ్మప్రవిష్టోస్మిగ్రీష్మేశీతమివహ్రదం। శామ్యామిపరినిర్వామిసుఖమాసేచసర్వదే’’ త్యుక్తంనిమజ్జనంసర్వేషామనన్యశరణానాంప్రాప్తం। అహంతు భవార్ణవేనిమజ్జామి, యద్వా అనంతత్వంభవార్ణవవిశేషణం నివర్తకస్య తవమాహాత్మ్యమివనివర్తనీయస్సంసారోపిమేనిరవధిరితిభావః। భవస్యార్ణవత్వరూపణేన‘‘సంసారార్ణవమగ్నానాంవిషయాక్రాంతచేతసాం।విష్ణుపోతంవినానాన్యత్కించిదస్తిపరాయణం। సంసారసాగరంఘోర’’మిత్యాదిప్రమాణానిసూచ్యంతే । సనకాదివన్నతీరాసన్నప్రదేశస్థోహమిత్యభిప్రాయేణాంతశ్శబ్దః। ఇతఃపూర్వమనాదౌకాలేనలబ్ధఇతి నిర్వేదాభిప్రాయేణాద్యతనలాభసంతోషాభిప్రాయేణచాచిరాదేత్యుక్తం। మేకర్మణఃప్రవాహైరితఃపూర్వముత్తారోపాయానభిజ్ఞస్యమమ । ‘‘మామేకంశరణంవ్రజే’’తివాదినంత్వాముపేక్షితవతఃఇదానీమపి మజ్జనహేతూనాశ్రయతఃత్వయైవత్వదాశ్రయణాయసంకల్పితస్యేతిభావః। అత్ర మేలబ్ధఇతిసంబంధసామాన్యేషష్ఠీ। మేకూలమివేతివాన్వయః, అర్ణవాంతర్మజ్జతఃకూలమివేత్యాశ్చర్యపరం, అనంతత్వాత్తత్ప్రాప్యసౌసన్నిహితఇతి శరణ్యాసౌలభ్యవ్యంజనంచ । లబ్ధోసిఉపాయతయాలబ్ధవ్యశేషంనాస్తినచలబ్ధస్యప్రచ్యుతిరితిభావః।నకేవలంమయైవలాభః కింతుత్వయాపిలబ్ధం సర్వసమత్వసంరక్షణాయసదాచార్యవీక్షణాది వ్యాజవిశేషాపేక్షిణాతత్సంపత్తిసంతుష్టేనేతితాత్పర్యం। అత్రభగవన్నితిసంబుద్ధ్యాతస్యైకస్యైవసర్వహితవేదిత్వంతన్నిష్పాదనశక్త్యాదికంచవ్యజ్యతే । జ్ఞానబలాదిపూర్ణస్యతవపునరయంమహోదయోలాభః ఏతచ్చత్వమేవవేత్సిత్వయాపి దురపహ్నవమితిచ । ఇదానీం-నాథముని ప్రభృతిసద్గురుసమీక్షణ దశాయామిత్యర్థః । అయంచాపర్యనుయోజ్యానాదిసాపేక్షప్రవాహానుగుణ్యేన త్వయైవసంకల్పితఃకాలఇత్యాకూతం । ఏకవచనాంతానుత్తమాదిశబ్దైర్దయాపాత్రస్యనిస్సమాభ్యధికత్వంసూచ్యతే । సమసద్భావేప్యధికనిషేధ మాత్రంవా వివక్షితం । పాత్రం విషయః। వాఙ్మనసాపరిచ్ఛేద్యానంతాపరాధినమాత్మానమిదమిత్యభినయన్నిర్దిశతి।ఏతత్పరిత్యాగేకస్మిన్ విషయేతవదయా

దిగుణజాతంచరితార్థంస్యాత్ నహ్యతోధికః కృపావిషయోస్తి ‹‹అపికశ్చిన్మముక్షుస్స్యా"దితిహిత్వత్కృపాజగజ్జనయతి। అతస్త్వత్ప్రపత్తేరన్యంన మేకర్తవ్యమస్తి ఆక్రందనమప్యేతదరతిమాత్రకృతం, భవతు స్వీకృతభరస్య మోక్షయిష్యామీతి స్వైనైవో క్తంకర్తవ్యమవశిష్యత ఇతిభావః॥

{అభూతపూర్వంమమభావికింవాసర్వంసహేమేసహజంహిదుఃఖం। కింతుత్వదగ్రేశరణాగతానాంపరాభవోనాథనతేనురూపః॥　౭౫}

అథస్యాత్పరతంత్రస్య శేషభూతస్య స్వతంత్రస్యావ్యర్థేష్టపవినియోగస్సోఢవ్యఃఅన్యథాపిదుర్నివారశ్చ,కించ‹‹హరిదుఃఖానిభక్తేభ్యోహితబుధ్యాకరోతిహి।శస్త్రక్షారాగ్నికర్మాణిస్వపుత్రాయయథాపితా। పరీక్షాంచజగన్నాథఃకరోత్యదృఢచేతసాం। యస్యానుగ్రహమిచ్ఛామితస్యవిత్తంహరామ్యహం। బాంధవైశ్చవియోగేనసదాభవతిదుఃఖితః। తేనదుఃఖేన సంతప్తోయదిమాంనపరిత్యజేత్ । తంప్రసాదంకరిష్యామియస్సునైరపిదుర్లభ"ఇత్యపిస్మర్యతే, అతస్స్వకర్మవిపాకఃక్షంతవ్యఃకింక్రందితేనేత్యతఆహ అభూతపూర్వమితి ॥ ఇతఃపూర్వంసంజాతేభ్యోవిలక్షణమిత్యర్థః । మమ‹‹అజ్ఞోజంతురనీశోయమాత్మనస్సుఖదుఃఖయోః।ఈశ్వరప్రేరితోగచ్ఛేత్స్వర్గంవా శ్వభ్రమేవవే"త్యుక్తస్వభావస్య గర్భజన్మజరామరణనరకాదిదుఃఖచక్రమధ్యవర్తినః । భావిభవిష్యత్ । కింశబ్దఃక్షేపార్థః।వాకారస్సాన్వనభ్యుపగతసోఢవ్యత్వపక్షాన్తరోపహార్థః। తేనాసహ్యత్వాభిప్రాయమంతర్ధాయాహ సర్వంసహఇతి । కర్మపరతంత్రతయాయథాపూర్వమనుభూతజాతీయం సర్వందుఃఖ మనుభవిష్యామి । మేసహజంహిదుఃఖం అనర్థపర్యంతాపురుషార్థసక్తస్యమమకర్మప్రవాహైరాత్మస్వరూపానుబంధివదపరిహార్యమిత్యర్థః।తథాప్యన్యదసహ్యమాపతిష్యతీత్యభిప్రాయేణాహకింత్వితి । త్వదగ్రే అపారకారుణ్యస్యసర్వత్రసన్నిహితస్యసర్వస్వామినస్సర్వశక్తేస్తవసన్నిధౌ । శరణాగతానామితిబహువచనమన్యేష్వపి ప్రపన్నేష్వయమేవన్యాయ ఇతిద్యోతనార్థం। మత్పరిభవస్త్వదేకాంతినాంసర్వేషాంచిత్తక్షోభహే

తురితివాభిప్రేతం । పరాభవః కర్మభిః కామక్రోధాదిభిరింద్రియైశ్చవిష యైశ్చ ఘోరైస్తద్విముఖీకరణం । నాథేతిసంబుధ్యాభగవతోభరస్వీకారయోగ్యత్వంస్వస్యచసనాథత్వేననిర్భరత్వంచ వ్యనక్తి । ఉక్తంహియుధిష్ఠిరకార్యార్థంబలభద్రంప్రతిసాత్యకినా “యేనాథవంతోహిభవంతి లోకేతేనాత్మకర్మాణిసమారభంతే । కార్యేషుతేషాంప్రభవంతినాథాశ్శైబ్యాదయోరామయథాయయాతే” రితి । భగవచ్ఛాస్త్రేచ “ప్రపన్నశ్చాతకోయద్వత్ప్రపత్తవ్యాఃకపోతవత్ । రక్ష్యరక్షకయోరేతల్లక్ష్యం లక్షణమేతయో” రితి । స్వతంత్రస్యాకర్మవశ్యస్యమే శరణాగతపరిత్యాగేపికోదోషఇత్యత్రాహ నతేనురూపఇతి। తే“స్థితేమనసి,సకృదేవ,సర్వధర్మా” నిత్యాదివాదినః। నానురూపఃనచతదుక్తం “రామోద్విర్నాభిభాషతే, అనృతంనోక్తపూర్వంమేనచవక్ష్యేకదాచనే” త్యాది స్వవచనవిరోధప్రసంగాత్ । తతశ్చ ‘తస్యనామమహద్యశ’ ఇతిశ్రుతిసిద్ధవైపరీత్యంస్యాత్, అతోమయాసహజదుఃఖభాజనేనసర్వమపిదుఃఖం సోఢుంశక్యం, త్వయాతునిత్యనిరవద్యేనదోషప్రసంగోనసోఢవ్యఇత్యనిష్టనివృత్తిలాభస్తేమత్తోప్యతిరిచ్యతే । మమచస్వామ్యవద్యప్రసంగోఽనిష్టతమః, తస్మాన్మద్రక్షణేనద్వయోరనిష్టపరిహారస్త్వయైవకార్యఇతిభావః । తదిదం వ్యాజమాత్రేణస్వార్థంరక్షిష్యతీతివిశ్వాసదార్ఢ్యవ్యంజనపరం । శేషభూతస్య స్వలాభకథనం స్వార్థప్రార్థనంచాయుక్తమితి శంకాచ ప్రధానభూతపరలాభోక్త్యాపరావద్యప్రసంగపరిహారప్రాధాన్యేనచనిరస్తా॥*

నిరాసకస్యాపినతావదుత్సహే మహేశహాతుం తవ
పాదపంకజం। రుషానిరస్తోపిశిశుస్తనంధయోనజా
తుమాతుశ్చరణౌజిహాసతి॥ ౨౬

అస్త్వేవం ప్రతిబుద్ధస్య తవ పదవలంబనంతథాపిమదనుగృహీతేనత్వయాసర్వేషాంపాపానాం క్రమాత్ప్రతిపదోక్తాని ప్రాయశ్చిత్తాని క్రియంతాం,పుణ్యక్షయార్థంభోగాశ్చభుజ్యంతాం, మత్స్వభావశ్చైవంప్రసిద్ధః “శరీరారోగ్యమర్థాంశ్చభోగాంశ్చైవానుషంగికాన్। దదాతిధ్యాయతాంనిత్యమపవర్గప్రదోహరి” రితి, అతః “భుక్త్వాచభోగాన్విపులాని”

త్యాదిక్రమేణముక్తింప్రాప్స్యసీతిభగవతోఽభిప్రాయ మాశంక్యపూర్వో
క్తమనన్యోపాయత్వమనన్యప్రయోజనత్వంచానంతరశ్లోకద్వయేన ప్రపం
చయిష్యన్ స్వస్యభగవత్పదప్రాప్తావిలంబాక్షమత్వం విజ్ఞాపయతి ॥నిరా
సకస్యేతి॥ పూర్వం దుఃఖస్యస్వతఃప్రతికూలతయా దుస్సహత్వేన హేయ
త్వముక్తం అనయోస్తుపరమపురుషార్థప్రతికూలతయా సుఖస్యాపి హేయ
త్వముచ్యత ఇతివిశేషః । నిరాసకస్య నిరంకుశస్వాతంత్ర్యాత్స్వావద్యం
సోఢ్వాపిత్వత్సుహృద్భిరుపచ్ఛందనైర్వాం ప్రతార్య మదభిమతముపదాయా
న్యత్రప్రేరయితుమిచ్ఛత ఇతిభావః ।అపిశబ్దేనదయాపరవశత్వం దీనస్య
మమనిరాసేకథంక్షమ ఇతివ్యజ్యతే। తావచ్ఛబ్దోఽవధారణార్థః। నోత్సహే
నశక్నోమీత్యర్థః । మహేశ సంభావితస్వపదభ్రంశానామపూర్ణానాం
త్వదన్యేషాంహి స్వాశ్రితేష్వసూయోపేక్షాదిసాన్యద్యధేంద్రాదీనాం
యయాతిప్రభృతిషు, భవతస్తునిరుపాధికస్వామిత్వ స్వాతంత్ర్యవతోని
రవధికదయాంబుధేర్మామీదృశీమవస్థాం ప్రాపయతో మన్నిరసనే హేతు
ర్నాస్తిమమచత్వామేకమేవసర్వేశ్వరమధిగచ్ఛతో నహిత్వత్పరిత్యాగే
కారణమస్తీతిభావః । మాతురితివక్ష్యమాణపదస్థానేమహేశశబ్దః । తేన
'మాతా పితా భ్రాతే' త్యాదిశ్రుతిప్రసిద్ధస్వభావసూచనం । హాతుమిత్య
త్రోపాయతయాఫలతయా చేతియోజ్యం । తముభయంతవపాదపంకజమి
త్యభాభ్యాంసూచ్యతే। సర్వభూతసుహృదస్సంసారనివృత్త్యుపాయభూ
తస్యభవతో దేవదానవసామాన్యదైవతం నిరవధికభోగ్యంపాదపద్మమితి
భావః । ఉక్తమర్థంసర్వలోకసమ్మతార్థాంతరనిదర్శనేనస్థాపయతి రుషే
తి।అపిశబ్ద ఇహాస్వతోనిరాసానర్హత్వం స్తనదంశనాదిజనితక్రోధలేశవశా
త్కదాచిత్తత్సంభవంచద్యోతయతిశిశుః స్తనంధయ ఇతిపదాభ్యాంస్వరక్ష
ణేస్వయమసమర్థస్య బాలస్యతదేకరక్ష్యత్వం తదేకాధీనజీవనత్వంచసూ
చ్యతే। జాతుక్రోధదశాయాంప్రసాదదశాయాంచేతిభావః । మాతురిత్య
నేనసర్వదోషపరిసహనానుగుణవాత్సల్యంవ్యజ్యతే । చరణావిత్యత్రనిరా
సాయవినియుక్తావపిలికాంక్షాగ్రాహ్యం ।హాతుమిచ్ఛాపినసంభవతికిముత
హానమిత్యభిప్రాయేణసన్నియోగః॥

తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథమ
న్యదిచ్ఛతి । స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో
నేక్షురకం హి వీక్షతే॥ ౨౯

ననునాస్మాసు నిరాసః యత్ప్రజాపతిప్రభృతిభోగేభ్యోఽతిశయితభోగప్రదానం, మాభూద్వా కేవలభోగపరతా ఇదానీం మద్దత్తభోగాన్భుక్త్వా పశ్చాన్మోక్షమపి దాస్యామీతి భగవతోఽభిప్రాయముత్ప్రేక్ష్య విలంబాక్షమః ప్రార్థితయా హాతుమశక్యత్వం వివృణోతి ॥ తవామృతేతి ॥ తవ 'రసో వై సః సర్వగంధస్సర్వరస' ఇత్యాదిషు సర్వప్రకారనిరతిశయభోగ్యతయా ప్రసిద్ధస్య సర్వస్వామినః । అమృతస్యందిని మోక్షప్రదే భోగ్యతమతయా చ శ్రుతిస్మృతిప్రసిద్ధే । నివేశితాత్మా రక్షణోన్ముఖేన "దదామి బుద్ధియోగం త"మిత్యాదివాదినా త్వయైవ దృఢావస్థాపితబుద్ధిరిత్యర్థః । తస్మాదితః పరం పురుషార్థాంతరే మనో నివేశయితుం న శక్యమితి భావః । అత్ర సామాన్యనిర్దేశస్త్వత్ప్రసాదవిషయభూతానాం మాదృశానాం సర్వేషాం సాధారణోఽయం స్వభావ ఇతి జ్ఞాపనార్థః । త్వత్పాదపద్మే మనో నివేశయంస్త్వమేవాత్ర పరిచోదనీయ ఇత్యభిప్రాయేణ కథం శబ్దః । అన్యత్ అల్పమస్థిరమనర్థమిశ్రమనర్థపర్యంతమైశ్వర్యం । కథమిచ్ఛతీతీచ్ఛానివృత్తివచనాత్తదర్థప్రవృత్తిరప్యత్ర నిరస్తా భవతి । ఉక్తమర్థం నిదర్శనేన ద్రఢయతి స్థితేఽరవింద ఇతి । భోక్తృణామక్లేశేన భోగ్యతమతయోపస్థితవతీత్యభిప్రేతం । అరవిందశబ్ద ఇహ సురభిత్వసుఖస్పర్శత్వాదివ్యంజకః । ప్రథమవికసితావస్థామభిప్రేత్యాహ మకరందనిర్భర ఇతి । మధువ్రతశబ్దేన తదేకజీవనత్వం తత్రాపి సారతమగ్రాహిత్వం చ వ్యజ్యతే । స్వాభిమతవిపరీతైరుపచ్ఛందనోపదేశతర్జనాదిభిర్దుర్నివారత్వం సూచయితుం తిర్యగ్దృష్టాంత ఉక్తః । ఇక్షురకం కంటకావృతమస్థిరాత్యల్పరసం భ్రమరస్పర్శమాత్రేఽపి మ్లానతామశ్నువానం దేవార్చనాద్యనర్హం నిర్గంధం కిమపి క్షుద్రపుష్పం । తన్న వీక్షతే అత్యాసన్నమపి మకరందలిప్సయా నాద్రియతే । తదుపసదనం తు దూరతో నిరస్తమితి భావః ॥ ౨౯

త్వదంఘ్రిముద్దిశ్యకదాపికేనచి ద్యథాతథావాపిసకృ
త్కృతోఞ్జలిః। తదైవముష్ణాత్యశుభాన్యశేషతశ్శుభా
నిపుష్ణాతినజాతుహీయతే॥ ౨౮

అథగురుతరోపాయసాధ్యంపురుషార్థంలఘుతరేణోపాయేనకథంలభస్వ సఇత్యత్రతతోపిలఘుతరస్యనివృత్తిధర్మకోటినివిష్టస్యాఞ్జల్యాదేఃప్రభావం త్వ దంఘ్రిమిత్యాదిశ్లోకద్వయేననిదర్శయన్నాశ్రయణసౌకర్యాదపిహాతు మశక్యత్వమేవస్థాపయతి తత్రప్రథమేనలఘు తరకాయికవ్యాపారవిశేష ప్రభావఉచ్యతే॥ త్వదంఘ్రిమితి ॥ త్వదంఘ్రింసర్వలోకశరణ్యస్యతవపా దపంకజం।నతుసాఙ్ఖ్యాన్మోక్షప్రధానానధికృతస్యహైరణ్యగర్భాదేరితిభా వః।తదుక్తంమోక్షధర్మే“బ్రహ్మాణంశితికంఠంచయాశ్చాన్యాదేవతాస్స్మృ తాః। ప్రతిబుద్ధానసేవంతేయస్మాత్పరిమితంఫల”మితి।అత్రభగవత్స్వరూ పస్యశుభత్వేప్యనిష్పన్నసమాధీనాం ప్రథమంభావయితుమశక్యతయాత ద్విగ్రహస్యైవ శుభాశ్రయత్వం , తత్రాప్యనతిక్రమణీయంహిచరణగ్ర హణమితి న్యాయాత్“ సభ్రాతుశ్చరణౌగాఢ” మిత్యాది దర్శనాచ్చాం ఘ్రిరుద్దేశ్యత్వేనోచ్యతే। ఉద్దిశ్యఉపాయతయాకైంకర్యలక్ష్యతయాచా భిసంధాయేత్యర్థః। ఏవమనన్యదేవతాకత్వ మనన్యప్రయోజనత్వంచో క్తంభవతి। ఈదృశస్యాధికారిణోఞ్జలిబంధరూపేసుకరేప్రసాదనేదర్శ పూర్ణమాసాదివత్తిథినక్షత్రపక్షమాసర్త్వయనహాయనాది కాలనియ మోనాస్తీత్యాహ కదాపీతి।విధేయహస్తస్యశాస్త్రీయవ్యాపారాంతరర హితదశాయాంసర్వదేత్యర్థః। ఏతేనకాలవిశేషప్రతీక్షణవిలంబాభావా ద్యదేచ్ఛతితదైవసహసాకర్తుంశక్యతయాపిసౌకర్యంసూచితం। ఉక్తః కా లనియమాభావః ‘ జాతపుత్రః కృష్ణకేశోగ్నీనాదధీతే ’త్యాద్యుక్తకృష్ణకే శత్వాద్యవస్థానియమాభావస్యదేశనియమాభావస్యచోపలక్షణం।ఏవంవ ర్ణాశ్రమవేదవేదాంగయుక్తత్వాదినియమాభావేన సామాన్యధర్మతయా సత్యవచనాదివత్సర్వాధికారత్వమాహ కేనచిదితి ।ఆస్త్రీబాలపండితమూ బ్రహ్మాశ్వపాకంచ సుకరత్వం శాస్త్రీయత్వంచాత్రవివక్షితం। కర్మాంత రవద్దుష్కరప్రకారవిశేషవ్యవస్థాప్యత్రనాస్తీత్యాహ యథాతథావాపీ

తి । అత్రవికల్పసముచ్చయ విషయావ్యయద్వయస్యైవనుభిప్రాయః ప
రా పరతత్త్వహితపురుషార్థేషు విశదబుద్ధిర్భవతు వా మావామస్తిష్క-సం
పుటాదిమయశ్శేషప్రకారశ్చభవతువిధేయహస్తరహితస్యవాచామనసా
వా స్యాత్ అస్తువాంజలిరచనాయాంకించిదచాతుర్యం సర్వధాసఫలఏవా
యమితి।నపునః“ఏకేన పాణినాయస్తుప్రణమేత్పురుషోత్తమం। న్యాయ్యస్త
స్యకరచ్ఛేదఇతివేదవిదోవిదుః ఏకహస్తప్రణామశ్చఏకంచాపిప్రదక్షిణ”
మితిశక్తంప్రత్యుక్తఏకహస్తప్రణామనిషేధఇహప్రతిషిధ్యతే। తాయతా
వంజలిః పుమానితిచనైఘంటుకాః । గత్యభావేతుసర్వత్రయథాశక్తికర
ణమనుజ్ఞాతం । సకృత్కృతశ్శాస్త్రార్థ ఇతిసామాన్యప్రాప్తస్యాత్రనిరప
వాదత్వాత్ । వసంతేవసంతే జ్యోతిషాయజేతే' త్యాదివదావృత్త్యపె
క్షాపినేత్యాహ సకృత్కృతఇతి । యద్యపిప్రీత్యాదిప్రకర్షాదస్యావృత్తి
ర్భవతి తథాప్యత్రసకృత్కృతస్య ఫలావినాభావేన ప్రభావాతిశయప్ర
తిపాదనేతాత్పర్యం।“సకృత్స్మృతోపిగోవిందోనృణాంజన్మశతైశ్చితం।
పాపరాశిందహత్యాశుతూలరాశిమివానలః ।సకృదుచ్చారితంయేనహరి
రిత్యక్షరద్వయం । బద్ధఃపరికరస్తేనమోక్షాయగమనంప్రతి ।ఋచోయ
జూంషిసామానియోఽధీతేసకృదంజసా । సకృదష్టాక్షరంజప్త్వాఫలంతస్య
సమశ్నుతే । విష్ణోరాయతనంనిత్యంసాయంప్రాతర్దినేదినే ॥ప్రదక్షిణద్వ
యంకుర్యాదశ్వమేధఫలంలభేత్ ।ఉత్సవేబలిదానేచతదాకుర్వన్ప్రదక్షి
ణం ।పదేపదేశ్వమేధస్యఫలందశగుణంభవేత్ ।యానియానిచపాపానిజ
న్మాంతరకృతానిచ। తానితానిప్రణశ్యంతిప్రదక్షిణపదేపదే”ఇత్యాదిషూ
క్తస్యసకృత్స్మరణసంకీర్తనాదిప్రభావస్యప్రదర్శనమిదం “ సర్వేషామే
వధర్మాణాముత్తమోవైష్ణవోవిధిః । రక్షతేభగవాన్విష్ణుర్భక్తానాత్మశరీర
వ”దితిసర్వాధికత్వేనకధితేభ్యస్సంమార్జనోపలేపనమాలాకరణదీపారో
పణాదిప్రసాదనాంతేభ్యస్సమధికంబహువిత్తవ్యయాయాసనిరపేక్షంవి
వక్షితస్యసుకరంస్వరూపమాహ అంజలిరితి అంజలిఃపరమాముద్రేతివ్యా
ఖ్యాతే। శ్రీమద్రామాయణేచ “ కృతాపరాధస్యహితేనాన్యత్పశ్యామ్య
హంక్షమం । అంతరేణాంజలింబద్ధ్వాలక్ష్మణస్యప్రసాదనా” దితి ।నారా

యణాస్త్రివృత్తాంతోఽప్యత్రానుసంధేయః । "క్షిప్రం దేవప్రసాదినీ"త్యు
క్తమాహ తద్దైవేతి । అవధారణేన శరీరాంతరకాలాంతరభావిఫలసాధ
నేభ్యః కర్మభ్యో వ్యావృత్తిః । యద్యప్యనాదివాసనావశాత్సాంసారిక
పుణ్యరూప నిగళభంగః పురుషస్యానిష్టస్స్యాత్, తథాప్యర్భకాపథ్యపరి
హారన్యాయేన తాన్యపి చోరయతీత్యభిప్రాయేణ ముష్ణాతీత్యుక్తం । అశు
భాని శుభప్రతిభటాని। యథార్హమపవర్గతదుపాయవిరోధినీత్యర్థః। అ
శేషతః కార్త్స్న్యేన। ఏతేన కృచ్ఛ్రచాంద్రాయణాదివత్ప్రతినియతా
శుభమాత్రనివర్తకత్వం వ్యుదస్యతే। న కేవలమనిష్టనివర్తకత్వమాత్రం "త
స్మిన్ప్రసన్నే కిమిహాస్త్యలభ్య' మితిన్యాయేనాత్రత్యానుభవ ప్రభృతిప
రిపూర్ణకైంకర్యపర్యంతసర్వాపేక్షిత సాధకత్వంచాస్తీత్యాహ శుభాని
పుష్ణాతీతి । కర్తర్యేకస్మిన్నుపకృతమపర్యాప్తం మన్యమానస్య భగవతః ప్ర
సాదాత్తదనుబంధినామపి తద్వదుపకారాయ భవతీత్యభిప్రాయేణాహ
న జాతు హీయత ఇతి । "యజ్ఞోఽస్య తేన క్షరతీ"త్యాదివదస్య న కేనాపి హానిరి
తి భావః। యద్వా స్వర్గాదివ దేవతాసాధ్యస్య పరమఫలస్య న కదాచిదపి వినా
శ ఇత్యభిప్రాయః । అథవా ఫలభూతాంజలిరూపేణ స్వయం సంతన్యత ఇ
తి వివక్షితం। దృశ్యతే హి "నిత్యాంజలిపుటా హృష్టా" ఇత్యుక్త్వా "యే తుము
క్తా భవంతీహ నరా భరతసత్తమ । తేషాం లక్షణమేతద్ధి యచ్ఛ్వేతద్వీపవాసి
నా"మితి నను చ యథాధికారం న్యాసోపాసనరూపౌ ద్వౌ మోక్షోపాయౌ
శాస్త్రేషు నిర్ణీతౌ, తత్కథమంజలిమాత్రస్య తత్సాధనత్వోక్తిః । ఇత్థం,
యద్యసావాకించన్యాదిలాభాత్ప్రపత్త్యధికారిణః పురుషస్య స్వరక్షణా
ర్థస్వవ్యాపారాంతరనివృత్తివ్యంజకముద్రాత్మనావతిష్ఠతే తదా తదుపల
క్షితాయాః ప్రపత్తేః ప్రాగుక్తసకలఫలసాధనత్వరూపప్రభావ ప్రతిపాద
నే తాత్పర్యాన్న విరోధః, యదా తు ప్రదక్షిణప్రణామాదివదయమపి భ
క్త్యంగకర్మవిశేషస్తదా "నేహాభిక్రమనాశోఽస్తీ"త్యాది న్యాయాత్క
ల్మషనిబర్హణసత్త్వోన్మేషసమ్యగ్జ్ఞానభక్త్యాదిపరంపరయా మోక్షసాధ
నత్వమితి నిష్కంటకోఽయం ఘంటాపథః । అతివాదపక్షస్త్వత్ర సంభవం
త్యాంగతౌ నియుజ్యతే । అథ కారివిశేషమాశ్రిత్యాంజలిరూపలఘుతరక్రి

యామాత్రస్య సాక్షాన్మోక్షసాధనత్వకథనే కర్మాంతరాణామపి తథాత్వప్రసంగః । తదభ్యుగమస్తు సర్వప్రమాణాననుగుణో భాష్యాదివిరుద్ధోవక్తుర్యామునమునేః ప్రాగనుష్ఠితగురుతరవిశ్వాసాదిగర్భ ప్రపత్తివైయర్థ్యంచ స్యాత్ । నను "ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేర్చయన్ । యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవం । కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్గుణః । కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజే" దితి కాలవిశేషవ్యవస్థయా సంకీర్తనమాత్రస్యైవ సాక్షాన్మోక్ష సాధనత్వముచ్యతే । సత్యం , తథాపి తస్మిన్కాలే ధర్మాంతరమనపేక్ష్య సంకీర్తనమాత్రస్యైవావ్యవహితమోక్షోపాయనిష్పాదకత్వే తాత్పర్యం గ్రాహ్యం । అన్యథా చరమయుగే ప్రపత్తిరప్యనపేక్షితా స్యాత్ । తదయమంజలిర్భక్తివత్ప్రపత్తివచ్చ ప్రయోజనాంతరపరాణాం యథాహం తత్తదభిమతసాధనం స్యాత్ । అనన్యప్రయోజనానాం తూక్తేనైవ ప్రకారేణాపవర్గపర్యవసాయీతి॥ ౨౭

ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం క్షణేన నిర్వాప్య ప
రాంచనిర్వృతిం । ప్రయచ్ఛతి త్వచ్చరణారుణాం
బుజద్వయానురాగామృతసింధుశీకరః॥ ౨౮

అథాంజలిమాత్రార్హాణామపి "విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః । అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః" ఇత్యుక్తకోసలజనపద పాదపన్యాయేనానురాగలేశమాత్రేణాపి శరణ్యచిత్తరంజనేన ప్రాప్తకాలే పరమపురుషార్థసిద్ధిస్స్యాదిత్యాహ ॥ ఉదీర్ణేతి ॥ ఉదీర్ణః నిత్యమప్యాత్మానమసత్కల్పం కర్తుమనుపరమేణ జాజ్వల్యమాన ఇత్యర్థః । సంసారః కర్మిణః పురుషస్య పూర్వపూర్వదేహప్రహాణే నోత్తరోత్తరదేహైరేకీకృత్యావిచ్ఛిన్నసంసరణరూపావస్థాప్రవాహః । దావాగ్నిత్వరూపణేన తాపత్రయప్రచురతయా దుస్సహతమత్వమన్యైరనుపశమనీయత్వం చ వ్యజ్యతే । ఆర్తిపౌష్కల్యవతాం ప్రపన్నానామవిలంబేన సర్వానిష్టప్రశమనమభిప్రేత్యాహ క్షణేన నిర్వాప్యేతి । న కేవలమనిష్టప్రశమనమాత్రమిత్యాహ పరాంచనిర్వృతిం ప్రయచ్ఛతీతి । నిర్వృతిస్సుఖం । అత్రసం

భవంత్యానిర్వృతేర్ముక్తానుభవసామ్యంముక్తిదశాయాంపరిపూర్ణానుభవరూపత్వంచాభిప్రేత్యపరామితివిశేషితం। త్వచ్ఛబ్దేన "ఏషహ్యేవానందయాతి రసగ్ంహ్యేవాయంలబ్ధ్వానందీభవతి" త్యామ్నాతమాకారద్వయమభిప్రైతి।సూత్రితంచ * తద్ధేతువ్యపదేశాచ్చ,అస్మిన్నస్యచతద్యోగంశాస్తీతి। చరణస్యారుణాంబుజత్వరూపణేనవిగ్రహస్యశ్యామతయాపరభాగశోభావ్యజ్యతే। అన్యోన్యసన్నికర్షజనితశోభయాప్యనురాగాతిశయహేతుత్వమభిప్రేత్యద్వయోపాదానం। అనురాగః "నాథయోనిసహస్రేషు యాప్రీతిరవివేకినా"మిత్యాదినిదర్శితా విషయస్వభావనిబంధనానిరతిశయప్రీతిః। అమృతసింధుత్వరూపణేన సంజీవనత్వంస్వయంప్రయోజనత్వమక్షయత్వంచవ్యజ్యతే। భాగ్యవిశేషవశాద్భగవతినిరుపాధికభోగ్యతావిర్భావేన స్వయంప్రయోజనభక్తిలేశోపి పరమభక్తిదశాం ప్రాప్యనిత్యకైంకర్యపర్యంతస్స్యాదిత్యభిప్రాయేణశీకరశబ్దః॥ ౨౯

విలాసవిక్రాంతపరావరాలయం నమస్యదార్తిక్షప
ణేకృతక్షణం।ధనంమదీయంతవపాదపంకజంకదాను
సాక్షాత్కరవాణిచక్షుషా॥ ౩౦

తదేవమిహతత్త్వజ్ఞానాదిపూర్వకం మోక్షార్థతయాప్రవృత్తస్యప్రపత్తిశాస్త్రార్థస్య అధికారేణ ననిందిత మిత్యాదిభిస్సప్తభిస్సామర్థ్యభాగస్సమర్థితః అథవిలాసేత్యాదిభిస్సప్తదశభిరుత్తరఖండార్థప్రదర్శకైః ప్రాప్యవైలక్షణ్యప్రపంచనపూర్వకమర్థిత్వభాగస్స్పష్టీక్రియతే, తత్రప్రథమేనస్వవిషయ భక్తిప్రభావప్రతిపాదనప్రీతేన భగవతాయథామనోరథంసర్వంకరిష్యామీత్యుక్తే తదత్తతీవ్రభక్తేస్స్వస్యతత్పాదారవిందసందర్శనేకాలక్షేపాక్షమత్వంవ్యనక్తి॥విలాసేతి॥ పరావరశబ్దాభ్యాం హిరణ్యగర్భాదయోమనుష్యాదయశ్చగృహ్యంతే। తేషామాలయాఃపృథివ్యాదయస్సత్యాంతాలోకాః తేవిలాసేనవిక్రాంతాయేనతద్విలాసవిక్రాంతపరావరాలయం। "యస్యోరుషుత్రిషువిక్రమణేషు అధిక్షియంతి భువనానివిశ్వా" "క్రాంత్వాధరిత్రీంగగనంతథాదివ" మిత్యాదిప్రమాణప్రసిద్ధమిదం। విక్రమస్యానాయాసలీలారూపత్వవ్యంజనాయవిలాసశ

ద్ధః । అత్రసర్వసులభత్వంచసూచ్యతే । ఏవంసులభస్యాయత్నసేవ్యత్వ
మనిష్టనివర్తకత్వంచాహ నమస్యదా ర్తిక్షపణేకృతక్షణమితి । నమస్య
తాంప్రహ్వీభవతాం తదైవాశేషా ర్తివినాశనేకృతక్షణందత్తావసరం ని
వృత్తవ్యాపారాంతరంవా । క్షణోవ్యాపారవైకల్యేకాలభేదాల్పకాల
యోరితినైఘంటుకాః। ధనంమదీయం అనన్యోపాయస్యమమాభిమతసా
ధనం పురుషార్థభూతంచ । తవపాదపంకజం స్వరూపాదిభిర్నిరతిశయ
భోగ్యస్యాశ్రితవత్సలస్యతే ముముక్షుధ్యేయం ముక్తం భోగ్యంచ పా
దారవిందం। కదేత్యాది 'నచక్షుషాపశ్యతికశ్చనైనం, స్వాధ్యాయశ్చ
క్షురుతఏకమస్యయోగోద్వితీయమభివీక్షణాయ అన్యాయనమననయనో
స్యద్రష్టా నమాంసచక్షురభివీక్షతేతం' "నమాంసచక్షుషాద్రష్టుం బ్రి
హ్మభూతస్యశక్యతే, ప్రత్యక్షోసినకస్యచి" దిత్యాదిషుమాదృశైర్దుర్దర్శత
యాప్రసిద్ధం త్వామద్యైవానేనైవచక్షుషాసాక్షాత్కర్తు మిచ్ఛామీత్యభి
ప్రాయః । ఏతేన "తాసామావిరభూచ్ఛౌరి' రితిన్యాయేనధనంజయాది
షుదివ్యచక్షుఃప్రదానన్యాయేనచదిదృక్షూణాంయథామనోరథంసహసై
వదృశ్యోభవతీతిప్రకాశ్యతే । అత్రముక్తిదశావివక్షాయాం 'సవాఏషది
వ్యేనచక్షుషామనసే' తివత్స్వాభావికజ్ఞానరూపేణచక్షుషేతియోజ్యం ॥

కదాపునశ్శంఖరథాంగకల్పకధ్వజారవిందాంకుశవ
జ్రలాంఛనం । త్రివిక్రమత్వచ్చరణాంబుజద్వయంమ
దీయమూర్ధానమలంకరిష్యతి॥ ౩౧

అథ "దివ్యందదామితేచక్షు"రితివదపేక్షితంసాక్షాత్కారందాస్యా
మీతిభగవతోక్తే దూరస్థస్యకాలాంతరేపితత్సంభవమాశంక్యశీఘ్రంప్రో
చితంతత్సంశ్లేషవిశేషమపేక్షతే।కదాపునరితి॥ పునశ్శబ్దస్సాశంకత్వద్యో
తకః సాక్షాత్కారమాత్రాద్విశేషద్యోతకోవా । "శంఖచక్రగదాప
ద్మైరంకితంపాదపంకజం। శరచ్చంద్రప్రతీకాశనఖరాజివిరాజితం। సురా
సురైర్వంద్యమానమృషిభిశ్చింతితంసదా । మూర్ధానంమామకందేవతా
వకంమండయిష్యతి।సంచింతయేద్భగవతశ్చరణారవిందంవజ్రాంకుశధ్వజ
సరోరుహలాంఛనాఢ్య"మిత్యాదిప్రసిద్ధమాకారమనుసంధత్తేశంఖరథాం

గేత్యాదినా। "ఏషబ్రహ్మలోకస్సమ్రాడితి" హోవాచ' "రాజాధిరాజస్స ర్వేషా" మితిశ్రుతిస్మృతిప్రసిద్ధసామ్రాజ్యచిహ్నత్వాభిప్రాయేణలాంఛనశబ్దః। తథాచోక్తం నారదీయే "భృంగారాసనవాజికుంజరరథశ్రీవత్సచాపేషుభిర్మాలాకుండలచామరాంకుశయవైశ్శైలధ్వజైస్తోమరైః। మత్స్యస్వస్తికవేదికావ్యజనకైశ్శంఖాతపత్రాంబుజైః పాదే పాణితలే నరాన్నృపతితాంయాంతిస్త్రియోరాజ్ఞితా" మితి। త్రివిక్రమేతిసంబుద్ధ్యానిమ్నోన్నతవిభాగానాదరేణసర్వేషాం శిరసికృతపదన్యాసత్వంస్వస్యతదలాభేననిర్వేదశ్చసూచ్యతే। త్వచ్చరణాంబుజద్వయం "అప్రాప్యః కేశవోరాజన్నింద్రియైరజితైర్నరైః" ఇత్యాదిష్వజితేంద్రియైర్దుర్లభతయాప్రసిద్ధస్యతవలక్ష్మీభూమిలీలాకమలంశంఖాదిరేఖాలంకృతాభరణస్థానీయం చరణయుగళంమదీయమూర్ధానం అత్యంతనిహీనస్యత్వత్పాదస్పర్శానర్హస్యదుష్టతమతయాకాళియవత్పాదపద్మదమనీయస్య మేచిరకాలంననమేయమితిత్వత్ప్రీణామవిరహేణదూషితముత్తమాంగం। అలంకరిష్యతి పశ్యన్ సాంసత్వవస్థానాం ప్రేక్షణీయంకరిష్యతీతిభావః। ఏతేనకలిదోషనివృత్తిరప్యర్థితాభవతి। ఉక్తంహిమహాభారతే "యావత్సపాదపద్మాభ్యాంపస్పర్శేమాంవసుంధరాం। తావత్పృథ్వీంపరిష్వంగేసమర్థోనాభవత్కలి" రితి। సంసారాగ్నిదగ్ధోహంత్వత్పాదస్పర్శేనపరీక్షిదివయథాహర్షం సంజీవిష్యామీతిచభావః। అత్ర "యావన్నచరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ। శిరసాధారయిష్యామినమేశాంతిర్భవిష్యతీ" తిభరతవాక్యం "తస్యతామ్రతలౌతాతచరణౌసుప్రతిష్ఠితౌ। సుజాతమృదురక్తాభి రంగులీభిరలంకృతౌ। ప్రయతేనమయామూర్ధ్నా గృహీత్వాహ్యభివందితా" వితి మార్కండేయవచనంచదర్శనీయం। యద్వాముక్తిదశాయాం పరిగృహీతాప్రాకృతశరీరస్యస్వస్యపరమపదపర్యంక నిలయభగవత్పాదమూలప్రవేశేత్వరాతిశయఇహప్రకాశ్యతే॥

విరాజమానోజ్జ్వల పీతవాససం స్మితాతసీసూన స
మామలచ్ఛవిం। నిమగ్ననాభింతనుమధ్యమున్నతం వి
శాలవక్షస్స్థలశోభిలక్షణం॥

ఉక్తప్రకారసందర్శనసంశ్లేషసమనంతర భావిసర్వవిధ కైంకర్యోద్దేశ్యం భగవంతం సమస్తకల్యాణగుణ దివ్యమంగళవిగ్రహాది విశిష్టతయా ప్రాప్యంచతుర్దశభిశ్శ్లోకైరనుసంధత్తే, తత్ర ప్రథమశ్లోకస్య పూర్వార్ధేన పీతాంబరపరభాగవిచిత్రితాం "అతసీపుష్పసంకాశః పీతవాసా జనార్దనః । వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపచితోమణి"రితి మహాభారతోక్తాం దివ్యస్వరూపస్య సముదాయశోభామనుభవతి ॥ విరాజమానోజ్జ్వల పీతవాసమితి ॥ పీతాంబరస్యశ్యామవర్ణవిగ్రహయోగాత్స్వతశ్చవిరాజమానత్వముజ్జ్వలత్వంభాస్వరత్వంచ । స్మితశబ్దోత్రవికాసార్థః । అతసీసూనంఅతసీప్రసూనం । శ్యామలరమణీయతయా విగ్రహస్యతత్సమత్వం। అమలచ్ఛవిం ఉజ్జ్వలకాంతిం ధ్యాయతాం దోషప్రతిభటద్యుతిమితివా ।అవయవేషు ప్రథమం అజనిష్టచకస్యనాభేరితి ప్రాగుక్తపారమ్య వ్యంజకం పితామహోత్పత్తిస్థానం నిర్దిశతి నిమగ్ననాభిమితి । నిమ్ననాభిమిత్యర్థః । ఉదరస్యాశేషభువనగర్భత్వేపి కృశత్వేనాద్భుతత్వమభిప్రేత్యాహ తనుమధ్యమితి । తథాచాహుశ్శ్రీవత్సాంకమిశ్రాః "అండానాంత్వదుదరమామనంతి సంతస్స్థానం తద్వరదకథన్ను కార్శ్యమస్య । మాహాత్మ్యం స్వత ఇహయే షు నూనమేషామ్మృద్ధిస్స్యాత్ప్రమహిమకరీనహీతరేషా"మితి। ఉన్నతం అతిహ్రస్వత్వాదిదోషరహిత సర్వాధికత్వవ్యంజక దివ్యవిగ్రహమిత్యర్థః । విశాలేత్యాది అతివిశాలభుజాంతరశోభమానప్రకృతితత్త్వనిరూపకలక్ష్మీనివాసశ్రీవత్సలక్షణం । అత్రద్వితీయాంతానాంసర్వేషాంభగవంతమితివక్ష్యమాణేనాన్వయః॥ ౩౨

చకాసతంజ్యాకిణకర్కశైశ్శుభై శ్చతుర్భిరాజానువిలంబిభిర్భుజైః । ప్రియావతంసోత్పలకర్ణభూషణశ్లథాలకాబంధవిమర్దశంసిభిః ॥

భుజమధ్యశోభానుసంహితా, అథవీరశృంగారచిత్రితాం భుజశోభామనుసంధత్తే ॥చకాసతమితి॥ అవతారదశాయాం విరోధి నిరాకరణార్థ వ్యాపారవ్యంజకై ర్జ్యాకిణైరంకితత్వం పరవిగ్రహభుజేష్వపి తదభేదానుసంధానేన నిర్దిశతి జ్యాకిణకర్కశైరితి ।శుభైః ఔదార్యవీర్యసౌందర్యా

దిశాలిభిః। పరరూపేపిచతుర్భుజత్వంప్రమాణసిద్ధమితిప్రకాశయితుమా
హ చతుర్భిరితి । యథోక్తంవిష్వక్సేనసంహితాయాం ‘‘వైకుంఠేతు ప
రేలోకేశ్రీసహాయోజనార్దనః । ఉభాభ్యాంభూమినీళాభ్యాం సేవితః ప
రమేశ్వరః।మహాయోగీజగద్ధాతాదివ్యసింహాసనోపరి।దివ్యసంస్తరణోపే
తే శేషాహిఫణిమండితే। పంచోపనిషదామ్నాత దివ్యమంగళవిగ్రహః।అ
ప్రాకృతతనుర్దేవో నిత్యాకృతిధరోయువా । నిత్యాతీతోజగద్ధాతానిత్యై
ర్ముక్తైశ్చ సేవితః । బద్ధాంజలిపుటైః హృష్టైర్నిర్మలైర్నిరుపద్రవైః । చ
తుర్భుజశ్శ్యామలాంగశ్శ్రీభూభ్యాం సహ నీళయా । విమలైర్భూషణై
ర్నిత్యైర్భూషితోనిత్యవిగ్రహః । పంచాయుధైస్సేవ్యమానశ్శంఖచక్రధ
రోహరిః । సహస్రస్థూణసంయుక్తే మంటపేపరమేశ్వరః । విన్యస్యవా
మకంబాహుమాసనేవామపార్శ్వకే। దక్షిణంజానుశేస్య స్తంలంబయన్
జగతాంపతి’’రితి।ఏవమేవధ్యానంభాష్యకారైర్నిత్యేప్రోక్తం।బలపౌష్క
రేతు‘‘దేవోవైకుంఠనాథస్తు అనంతాసనసంస్థితః। సేవ్యశ్శ్రీభూమినీళా
భిః ప్రాదుర్భావైస్తుచాఖిలైః । శంఖచక్రధరోనిత్యంజానున్యస్తైకహస్త
వాన్।అభయప్రదహస్తశ్చ నీలజీమూతసన్నిభః।ధ్యాతవ్యోనిత్యలోకస్థో
భుక్తిముక్తిఫలప్రద’’ఇతి। అత్రాభయప్రదహస్తత్వాది వైషమ్యమవస్థా
భేదాదుపపద్యతే।యత్తుకైశ్చిదుక్తం‘ముఖంకిమస్యకౌబాహూ, బాహూ
రాజన్యఃకృత’ఇతి పురుషసూక్తవాక్యాభ్యాం ‘దశహస్త్యా అంగుళయోద
శపద్యా ద్వావూరూ ద్వౌబాహూఆత్మైవపంచవింశ’ఇత్యైతరేయకో
క్త్యా‘పాణిభ్యాంత్రయీంసంభరతీ’త్యాదిరహస్యామ్నాయోక్త్యాచ పర
స్యద్విభుజత్వంసిద్ధ్యతీతి తదయుక్తం। తేషాంవాక్యానాంప్రకరణాదిభిరస్య
పరత్వేనపరస్యచతుర్భుజత్వప్రతిషేధాదర్శనాత్। యచ్చోక్తం శ్రీసాత్వ
తే‘‘నాదావసానగగనే దేవోనంతస్సనాతనః ।శాంతస్సంవిత్స్వరూపస్తు
భక్తానుగ్రహకామ్యయా । అనౌపమ్యేనవపుషాహ్యమూర్తోమూర్తతాం
గతః । విశ్వమాప్యాయయన్కాంత్యాపూర్ణేన్ద్వయుతతుల్యయా । వర
దాభయదేనైవశంఖచక్రాంకితేనచ ।త్రైలోక్యోద్ధృతిదక్షేణ యుక్తః
పాణిద్వయేనస’’ఇతి।తదిదంతత్రత్యహృద్యాగవిశేషవిధిపరం। శ్రీపౌష్క

రే‘‘ద్విభుజంపురుషాకారంయుక్తమాదిత్యసన్నిభైః। ధ్యాజై రాభరణైశ్చిహ్నై శ్శంఖచక్రాదిసంజ్ఞితై’’రితి। సౌమంతవేచ ‘‘నిరస్తాద్విభుజాసోమ్యాశ్శంఖచక్రకరాంకితా।మహాపురుషరూపాచసుప్రసన్నావిలక్షణా’’తి భారద్వాజేచ ‘‘ద్విబాహుర్వాప్యశ్చక్రధృత్వాణిర్దక్షిణ శ్శంఖధృత్పరః। ఉపవిష్టంతుమోక్షార్థీఉద్ధితంవిశ్వసిద్ధయ’’ఇతి। సాంకర్షణేచ ‘‘పురుషోత్తమస్యదేవస్య శుద్ధస్యస్ఫటికత్విషః। సమపాదస్యపద్మస్థే ద్విహస్యైకవక్త్రస్యసంస్థితిః। వరదాభయహస్తాద్వావప్రవృత్తాఖ్యకర్మణి’’ఇతి। ఏతాన్యన్యానిచైవంవిధాని వాక్యానితత్తద్రూపసద్భావమాత్రపరాణి। యత్పునరానందాఖ్యసంహితాయాముక్తం ‘‘స్థూలమష్టభుజం ప్రోక్తం సూక్ష్మంచైవచతుర్భుజం। పరంతుద్విభుజంప్రోక్తం తస్మాదేతత్త్రయం యజే’’ దితి। ఏతదపిపరరూపమధికృత్యైవబహ్వీషుసంహితాసుచతుర్భుజత్వప్రతిపాదనాదిచ్ఛాగృహీతాభిమతోరుదేహస్య దేవస్య వైకల్పిక ధ్యానపరతయా సుసంగతం। దృశ్యతేచ నృసింహ కృష్ణాద్యేకైకరూపే ష్వేవద్విభుజత్వ చతుర్భుజత్వవర్ణ భేదాద్యవాంతరవైషమ్యంపరస్మింశ్చ నిత్యోదితశాంతోదితాదివిభాగస్సంప్రతిపన్నఇతి సర్వంసుస్థం। అత్రశ్లోకే జ్యాకిణేత్యాదినా స్వభక్తసంరక్షణార్థం మహావీరత్వం ప్రియావతంసే త్యాదినాస్వానురూపవీరపత్నీసంబంధస్తత్పురస్కారేణ సర్వైరభిగమనీయత్వంచ సూచ్యతే ॥ ౩౩

ఉదగ్రపీనాంసవిలంబికుండలాలకావలీబంధుర కంబు
కంధరం। ముఖశ్రియా న్యక్కృత పూర్ణనిర్మలామృ
తాంశుబింబాంబురుహోజ్జ్వలశ్రియం ॥ ౩౪

ఏవంపీతాంబరప్రభృత్యారోహణక్రమేణభుజానుభవానంతరందివ్యకంఠశోభాంముఖశోభాంచానుసంధత్తే ॥ ఉదగ్రేతి॥ ఉదగ్రమున్నతంపీనమకృశం ఉదగ్రపీనాంసవిలంబిభ్యాం కుండలాలకావళిభ్యాం బంధురా సుందరాకంబువదభిరామాత్రిరేఖాలంకృతా కంధరా యస్యసతథోక్తః రేఖాత్రయాంకితాగ్రీవా కంబుగ్రీవేతికథ్యతే ।కుండలాలకసమభివ్యాహారః పరభాగకాంతివ్యంజనార్థః।‘‘పాపంహారతియత్పుంసాం స్మృతంసం

కల్పనామయం। తత్పుండరీకనయనంవిష్ణోర్ద్రష్ట్యాయ్యహంముఖ"మిత్యా
దిప్రసిద్ధాంపావనమనోహరాంముఖశోభామనుభవతి ముఖశ్రియేతి । ము
ఖకాంత్యేత్యర్థః న్యక్కృతేత్యాది యస్యముఖశ్రియాన్యక్కృతంపూర్ణ
నిర్మలామృతాంశుబింబమంబురుహోజ్జ్వలశ్రీశ్చసఏవముదీరితః । అం
బురుహశ్రియఉజ్జ్వలత్వంనూతనవికాసకాంతిసౌకుమార్యాదిభిః । అమృ
తాంశుబింబాంబురుహయోర్ద్వాద్వంద్వః తయోరుజ్జ్వలశ్రీరితి తత్పు
రుషః॥ ౩౪॥

{ప్రబుద్ధముగ్ధాంబుజచారులోచనంసవిభ్రమభ్రూలత
ముజ్జ్వలాధరం । శుచిస్మితంకోమలగండమున్నసంల
లాటపర్యంతవిలంబితాలకం॥ ౩౫}

ఉక్తప్రకారాంముఖశోభాంప్రత్యేకావయవభావనయాపునరపి నిర్వి
శతి ప్రబుద్ధేతి॥ ప్రబుద్ధం వికసితం ముగ్ధంనూతనంసౌమ్యంవా । తథాచ
నైఘంటుకాః । ముగ్ధంసౌమ్యేనవేమూఢఇతి । అంబుజవల్లోచనయోశ్చా
రుత్వమాశ్రితదర్శనప్రీతి వికసితత్వేన తదనుగ్రహయోగసౌమ్యతయా
కాంత్యతిశయాచ్చ । సవిభ్రమభ్రూలతమిత్యనేనాపిస్వభక్తసంప్రా
ప్తిజనితోల్లాసాతిశయస్సూచ్యతే । ఉజ్జ్వలాధరంప్రవాళాదిభ్యోప్యధిక
ప్రకాశమానాధరం।విద్రుమముక్తికన్యాయేనాధరశోభయావిశేషితాం
స్మితశోభామాహ శుచిస్మితమితి।అవదాతస్మితమిత్యర్థః। అథవా""స్మయ
న్నివనృపోహంతీ"తివద్వ్యుద్ధాభిసంధింపరిహర్తుమిహశుచిత్వోక్తిః । ఏవం
చోక్తంశ్రీపౌష్కరే""పూర్వకర్మానలార్తానాంధ్యాయతాం ఖేదశాంత
యే। స్వేదంతేందుచయోత్థేనహ్లాదయన్ గోగణేనత్వి"తి । కోమలగండం
సుకుమారకపోలం। ఉన్నసం ఉన్నతనాసావంశం । అలకానాంపశ్చాదం
సలంబిత్వంప్రాగుక్తం, అత్రతుపురస్తాల్లలాటోర్ధ్వభాగలంబిత్వమాహ
లలాటపర్యంతవిలంబితాలకమితి॥ ౩౫॥

{స్ఫురత్కిరీటాంగదహారకంఠికా మణీంద్రకాంచీగుణ
నూపురాదిభిః । రథాంగశంఖాసిగదాధనుర్వరైర్లస
త్తులస్యావనమాలయోజ్జ్వలం॥ ౩౬}

ఈశ్వరత్వేనశంకనీయయోర్బ్రహ్మరుద్రయోరాదిమం రూపం తాప
సవేషేణ కమణ్డవశ్యత్వవ్యంజకం భగవతస్తుకిరీటాదియోగాత్సర్వేశ్వర
త్వఖ్యాపకమిత్యభిప్రాయేణాహ ॥స్ఫురత్కిరీటేతి ॥ కంఠికాకంఠభూష
ణం మణీంద్రః కౌస్తుభః సచజీవతత్త్వాభిమానీ । ఆదిశబ్దేనాపరిమితానిది
వ్యాభరణాంతరాణిసంగృహ్యంతే । రథాంగాదయఃపంచమన స్తత్త్వ
తామసాహంకారసత్వ్యజ్ఞాన బుద్ధితత్త్వసాత్త్వికాహంకారాభి మాని
త్వేనప్రసిద్ధాః । స్పర్శరూపగంధవిశేషైర్లసంతీతులసీలసత్తులసీ తయా ।
యుక్త్యా లసంతీతులసీయస్యాస్సాతథేతివనమాలావిశేష్యతే।స్ఫురదజ్జ్వ
లమితిపదాభ్యామాభరణాదేర్విగ్రహస్యచాన్యోన్యయోగాదపి శోభమా
నత్వంఖ్యాప్యతే । అత్ర "స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపైరనూప
మైః । చిన్మయైస్స్వప్రకాశైశ్చ అన్యోన్యరుచిరంజితై" రిత్యాఃకంద్రష్ట
వ్యం। చిన్మయైరస్పృష్టసంసారతత్త్వైదవతాత్మకైరిత్యర్థః॥ ౩౮

చకర్థయస్యాభవనంభుజాంతరంతవప్రియంధామయ
దీయజన్మభూః । జగత్సమస్తంయదపాంగసంశ్రయం
యదర్థమంభోధిరమంథ్యబంధిచ॥ ౩౯

ఈదృశకిరీటాదిభిస్సర్వేశ్వరత్వేనవ్యంజితస్యభగవతస్సామ్రాజ్యం స
లక్ష్మ్యైకస్యేతిత్రిభిశ్శ్లోకైస్సహేతుకమనుసంధత్తే।తత్ర"తతోవలోకితా దే
వాహరివక్షస్స్థలస్థయా। శ్రియమున్నిద్రపద్మాక్షీంవిష్ణువక్షస్స్థలేస్థితాం॥
కాచాన్యాత్వామృతేదేవిసర్వయజ్ఞమయంవపుః । అధ్యాస్తేదేవదేవస్య
యోగిచింత్యంగదాభృత" ఇత్యాదిషూక్తమాహ॥చకర్థయస్యాభవనంభు
జాంతరమితి॥"ఏషనారాయణఃశ్రీమాన్ క్షీరార్ణవనికేతనః ।నాగపర్యంక
ముత్సృజ్యహ్యాగతోమధురాంపురీ" మిత్యాదిప్రసిద్ధమాహతవప్రియంధా
మయదీయజన్మభూరితి।బ్రహ్మాదీనాంసర్వేషాంతత్కటాక్షాధీనవైభవత్వ
మాహజగత్సమస్తంయదపాంగసంశ్రయమితి।యథోచ్యతే"త్వయాదేవి
పరిత్యక్తంసకలంభువనత్రయం।వినష్టప్రాయమభవత్త్వయేదానీంసమేధి
తం।త్వయావలోకితాస్సద్యశ్శీలాద్యైస్సకలైర్గుణైః। ధనైశ్వర్యైశ్చయు
జ్యంతేపురుషానిర్గుణా అపి।సశ్లాఘ్యస్సగుణీధన్యస్సకులీనస్సబుద్ధిమాన్। స

శూరస్య చ విక్రాన్తో యం త్వం దేవి నిరీక్షసే" ఇత్యాది । శ్రీమహాభారతే చ శ్రీవాసవసంవాదే స్వయమేవ దేవదేవ్యాస్స్వవైభవం ప్రదర్శితం । "పుణ్యేషు త్రిషు లోకేషు సర్వే స్థావరజఙ్గమాః । మమాత్మభావమిచ్ఛన్తో యతన్తే పరమాత్మనా ॥ సాహం వై పఙ్కజే జాతా సూర్యరశ్మిప్రబోధితే । భూత్యర్థం సర్వభూతానాం పద్మా శ్రీః పద్మమాలినీ ॥ అహం లక్ష్మీరహం భూమిః శ్రీశ్చాహం బలసూదన । అహం శ్రద్ధా చ మేధా చ సన్నతిర్విజితిః స్మృతిః । అహం ధృతిరహం సిద్ధిరహం త్విడ్భూతిరేవ చ । అహం స్వాహా స్వధా చైవ సన్నతిర్నియతిః కృతిః । రాజ్ఞాం విజయమానానాం సేనాగ్రేషు ధ్వజేషు చ । నివాసే ధర్మశీలానాం విషయేషు పురేషు చ । జితకాశిని శూరే చ సఙ్గ్రామేష్వనివర్తిని । నివసామి మనుష్యేషు సదైవ బలసూదన । ధర్మనిత్యే మహాబుద్ధౌ బ్రహ్మణ్యే సత్యవాదిని । ప్రశ్రితే దానశీలే చ సదైవ నివసామ్యహం । యత్రాహం తత్ర మత్కాన్తా మద్విశిష్టా మదర్పణాః । సప్త దేవ్యో మయాష్టమ్యో వాసం తైష్యన్తి చాష్టధా । ఆశా శ్రద్ధా ధృతిః శాన్తిర్విభూతిస్సన్నతిః క్షమా । అష్టమాం విద్ధి మాం తాసాం పురోగాం పాకశాసనే"తి । శ్రీవిష్ణుస్మృత్యన్తే బ్రహ్మపురాణే చ సహస్రనామస్తోత్రే భగవచ్ఛాస్త్రే చ హిరణ్యగర్భకాశ్యపమఙ్కణధనదాదిసంహితాసు బ్రహ్మరుద్రేన్ద్రాదీనాం తదధీనవైభవత్వం విస్తరేణ ద్రష్టవ్యం । యదర్థం యత్ప్రాప్త్యర్థమితి యావత్ । పరస్పరవిశ్లేషప్రసఙ్గరహితయోరేవ లక్ష్మీతద్వల్లభయోర్విశ్లేషాభినయేన పునః ప్రాప్తిరుచ్యతే । స్వసఙ్కల్పనిబన్ధా చ స్వతన్త్రలీలా న పర్యనుయోగమర్హతి । అమన్థి విష్ణ్వవతారే । అబన్ధి రామావతారే । యథోక్తం "తతస్స్ఫురత్కాన్తిమతీ వికాసికమలే స్థితా । శ్రీర్దేవీ పయసస్తస్మాదుత్థితా ధృతపఙ్కజే"త్యారభ్య "దివ్యమాల్యామ్బరధరా స్నాతా భూషణభూషితా । పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షస్స్థలం హరే"రితి "ఏష సేతుర్మయా బద్ధస్సాగరే మకరాలయే । తవ హేతోర్విశాలాక్షి నలసేతుస్సుదుష్కర" ఇతి చ । అత్ర జగత్సమస్తమితి పాదే నానురూపత్వం పాదాన్తరైరభిమతత్వం చ ప్రఖ్యాపితం ॥

{స్వవైశ్వరూప్యేణసదానుభూతయాప్యపూర్వవద్వి
స్మయమాదధానయా। గుణేనరూపేణవిలాసచేష్టితై
స్సదాతవైవోచితయాతవశ్రియా॥ ౩౮}

ఉక్తమేవాభిమతానురూపత్వమనంతరశ్లోకేనప్రపంచయతి ॥ స్వవైశ్వరూప్యేణేతి॥ స్వస్యవిశ్వశరీరకత్వేనేత్యర్థః।సదానుభూతయా "యోవేత్తియుగపత్సర్వం ప్రత్యక్షేణసదాస్వతః"ఇతిదృశేనసహజప్రత్యక్షేణ సదాసాక్షాత్కృతయేత్యర్థః। ఏతదభిప్రాయేణతదవినాభూతవైశ్వరూప్యస్య హేతుత్వోక్తిః। యద్వా స్వరూపాదిసర్వాకారేణశాంతానంతేత్యాదిప్రక్రియయాసర్వదాగాఢోపగూఢత్వేనానుభవోవివక్షితః। అపూర్వవత్ అదృష్టపూర్వవత్। యద్వా ఇతఃపూర్వమనాలోచితవతఇవేత్యర్థః। విస్మయం అద్భుతరసహేతుభూతంభావం। అనవధికంప్రీతివిశేషమిత్యర్థః। ఆదధానయేత్యత్రాపి సదేత్యభిప్రేతం। ఏతేనస్వభావసిద్ధమభిమతత్వంప్రపంచితం। గుణేనేత్యాదినాతుసర్వప్రకారానురూపత్వముచ్యతే। గుణశబ్దఇహజ్ఞానకారుణ్యాదివిషయః। రూపేణ అప్రాకృతేనాఖిలజగన్మాతృత్వాభివ్యంజకేనదివ్యవిగ్రహేణ। విలాసైఃభగవదభిమతైర్లీలావిశేషైః। చేష్టితైః ఆశ్రితరక్షణావతారాదిభిః। తవైవోచితయేత్యనేన "తుల్యశీలవయోవృత్తాం। దేవత్వేదేవదేహేయం। దేవతిర్యఙ్మనుష్యేష్వి"త్యాదిషూక్తమనురూపత్వంప్రతిపాద్యతే। తవశ్రియేత్యనేన "విష్ణోశ్శ్రీరనపాయినీ"త్యాదిప్రసిద్ధంనిత్యవ్యవస్థితపతిపారార్థ్యంప్రతిష్ఠాపితం। తృతీయాంతానాంతమేత్యుత్తరశ్లోకస్థపదేనాన్వయః॥ ౩౮

{తయాసహాసీన మనంతభోగిని ప్రకృష్టవిజ్ఞానబలైక
ధామని। ఫణామణివ్రాతమయూఖమండలప్రకాశ
మానోదరదివ్యధామని॥ ౩౯}

"వైకుంఠేతుపరేలోకేశ్రియాసార్ధంజగత్పతిః। ఆస్తేవిష్ణురచింత్యాత్మే"తిపురాణప్రసిద్ధమాహ॥ తయాసహేతి ॥ భూమ్యాదిపత్న్యంతరవతోపిశ్రియఃప్రాధాన్యాదిహతదుక్తిః। తదపేక్షయాపిభగవతఃప్రాధాన్యవ్యంజనాయసహశబ్దః। ఆసీనమిత్యనేన 'సహస్రస్థూణేఽనిర్మితేదృఢ

ఉగ్రేయత్రదేవానామధిదేవ ఆస్త'ఇతితవలాకారశ్రుతేః స్మర్యతే । ఉపాత్తాచేయమభియుక్తైః “సర్వాత్మసాధారణ నాథగోష్ఠీపూరే కపిదష్వారమహావకాశం । ఆస్థానమానందమయం సహస్రస్థూణాదినామ్నాతమవాప్నవానీ"తి। అనంతభోగిని “గంధర్వాప్సరసస్సిద్ధాస్సకిన్నరమహోరగాః । నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోయముచ్యత" ఇతి సుప్రసిద్ధానంతనామ్ని విశ్వంభరాధారణవినియుక్తే మహాభోగిని। ప్రకృష్టవిజ్ఞానబలైకధామని ప్రకృష్టయోర్విజ్ఞానబలయోరేకాశ్రయే । అస్యసంకర్షణాఖ్యవ్యూహాభిమానవిశేషయోగాత్తదనుగుణౌ గుణావిహనిర్దిశ్యేతే । పంచవిధజ్యోతిస్సిద్ధాంతప్రవర్తకత్వేన జ్ఞానప్రకర్షోస్య ప్రసిద్ధః । సర్వాధారభూతభగవద్విగ్రహధారణేనబలప్రకర్షస్యవ్యక్తిః “తేనేయంనాగవర్యేణశిరసావిధృతా మహీ । బిభర్తి మాలాం లోకానాం సదేవాసురమానుషా"మిత్యాదిభిశ్చ। యస్యఫణామణివ్రాతమయూఖమండలైః ప్రకాశమానోదరందివ్యధామ స ఏవ మహాశ్చర్యాకారతయోత్తరార్ధేనోక్తః । దివ్యధామశబ్దోత్ర వైకుంఠాఖ్యమప్రాకృతంనిత్యందివ్యంభగవద్విమానంవదతి

నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవా
రణాదిభిః । శరీరభేదైస్తవ శేషతాంగతైర్యథోచితం
శేషఇతీరితేజనైః॥ ౪౦

ఉక్తప్రభావంపర్యంకభోగినంవృత్తివిశేషానుగుణ సమాఖ్యాంతరేణాపివిశినష్టి ॥ నివాసేతి ॥ నివాసోదివ్యాయతనం శయ్యాత్వంయోగనిద్రావస్థాయాంఆసనంపర్యంకవిద్యాదిష్వామ్నాతదివ్యసింహాసనం। పాదుకే “అధిరోహార్యపాదాభ్యాంపాదుకేహేమభూషితే । ఏతేహిసర్వలోకస్యయోగక్షేమంవిధాస్యత"ఇత్యవతార దశాయాం ప్రసిద్ధవైభవే। అంశుకంపీతాంబరాది । ఉపధానముత్తమాంగధారకంపాదధారకంచ।వారణశబ్దస్య ద్వంద్వాత్పరత్వాద్వర్షవారణమాతపవారణంచేతి యోజ్యం। ఆదిశబ్దేనపాదపీఠాదిసంగ్రహః । శరీరభేదైరిత్యనేన ‘అపరిమితధాభవతీ'తిన్యాయోభిప్రేతః । తవ కైంకర్యోద్దేశ్యదివ్యమంగళవిగ్రహవిశిష్టస్య । శేషతాం స్వోపకారతాప్రాధాన్యానాదరేణపరోపకారాహ-

తాం। * శేషః పరార్థత్వాదితి సూత్రాభిప్రేతం వేదార్థసంగ్రహే వివృతం। పరగతాతిశయాధానేచ్ఛయోపాదేయత్వమేవ యస్య స్వరూపం స శేష ఇతి। యథోచితం ఉక్తప్రవృత్తినిమిత్తానుగుణమిత్యర్థః। జనైరిత్యేతత్పామరపరీక్షకసర్వలోకప్రసిద్ధిజ్ఞాపనార్థం॥ ౪౦

దాసస్సఖా వాహనమాసనం ధ్వజో యస్తే వితానం వ్య
జనం త్రయీమయః। ఉపస్థితం తేన పురో గరుత్మతా త్వ
దంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా॥ ౪౧

ఏవమనంతవత్తదవసరోచితసేవార్థనానావిధరూపభేదైః కింకుర్వాణేన గరుత్మతా సేవితత్వమాహ॥ దాస ఇతి॥ పూర్వశ్లోకే శేషత్వముక్తం అత్ర తు దాసశబ్దేన తదేవ విశేష్యతే। శేషత్వం హ్యచేతనం ప్రత్యచేతనస్యాపి భవతి, దాసత్వం తు చేతనం ప్రత్యేవ చేతనస్యైవ స్యాత్। తథైవ లోకవ్యవహారాత్। అత్ర ప్రథమం దాస ఇత్యుక్తిః సఖిత్వాద్యవస్థాయామపి స్వాభావికస్య దాసత్వస్యానపగమద్యోతనార్థా। ఉచ్యతే హి 'లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రావణే'తి। గరుత్మతస్తు సఖిత్వం కదాచిదభినయప్రయుక్తం। యద్వా సమానచిత్తవృత్తిత్వం సఖిత్వమితి దర్శితమిత్యాద్యుక్తచిత్తవృత్తిసామ్యమిహ వివక్షితం। వాహనత్వాదికం తు గమనాద్యవస్థాసు యథార్హం భావ్యం। త్రయీమయః సర్వవేదమయవిగ్రహ ఇత్యర్థః। శ్రూయతే హి 'సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షు'రిత్యాది। తథా 'తస్య గాయత్రీ చ జగతీ చ పక్షావభవతాం ఉష్ణిక్చ త్రిష్టుప్చ పృష్ఠ్యౌ అనుష్టుప్చ పఙ్క్తిశ్చ ధుర్యౌ బృహత్యేవోక్తిరభవత్ స ఏతం ఛందోరథమాస్థాయైతమధ్వానమనుసమచర'దితి। పురః ఉపస్థితం పురస్తాదాభిముఖ్యేన సేవితమిత్యర్థః। త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినేత్యేతత్పూర్వోక్తజ్యాకిణన్యాయేన కమఠావశ్యకాభినయదశాయాం భావ్యం।

త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినా త్వయా నిసృష్టాత్మభరేణ
యద్యథా। ప్రియేణ సేనాపతినా న్యవేది తత్తథానుజా
నంతముదారవీక్షణైః॥ ౪౨

అథ భగవతస్స్వవైభవానురూపం స్వసంకల్పకల్పిత నిత్యాధికారసే
నాపతిసేవాప్రకారమభిదధానః శ్రీశభుక్తోజ్ఝిత శేషజీవన ఇతి శ్లోకో
క్తమాహ॥ త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినేతి॥ త్వదీయభుక్తం త్వద్భుక్త
మిత్యర్థః। యద్భోక్తవ్యతయా భోజనపాత్రే నిహితే కించిదభుక్తం స్యా
త్తద్భుక్తోజ్ఝితమిత్యుదీర్యతే తదేవాత్ర భుక్తశిష్టతయా శేషశబ్దార్థః। య
ద్వా భుక్తోజ్ఝితైకదేశవిషయోఽయం శేషశబ్దః। అంశాంతరస్యాన్యార్థత
యా విభజనీయత్వోక్తేః। త్వయా నిసృష్టాత్మభరేణ స్వచ్ఛందవృత్తినా
త్వయా సమర్పితాత్మభరేణేత్యర్థః। అసురనిరాకరణాదిషు సేనానిర్వహ
ణాదిభారస్సేనాపతిత్వేన కల్పితే హ్యస్మిన్ విన్యస్యతే। అత స్తన్నియోగపూ
ర్వకమన్యే ప్రవర్తంతే। జగత్సృష్ట్యాదిభారోఽస్మిన్ సమర్పిత ఇతి కేషాంచి
ద్వ్యాఖ్యానం తు భగవదధీనత్వప్రభావాతిశయప్రశంసార్థం। ఏకస్యై
వహి సర్వశరీరిణో బహు స్యామితి సంకల్పకృతత్వమితి ప్రాగేవ స్థాపితం।
అతఏవ శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్తాత్మైశ్వర్యమితి శ్రీవైకుంఠగద్యో
క్తిరపి భక్తానాం స్వామిసేవావిఘ్నప్రశమనే పరిజననియోగాదౌ చ యో
జనీయా। విష్వక్సేనమంత్రే తు విశ్వసృజ ఇతి పదముక్తవత్ప్రభూతసృష్టి
మాత్రపరం, విశేష్యభూతపరమాత్మపర్యంతం వా నేతవ్యం। నిత్యానాం జ్ఞా
నభోగయోరీశ్వరేణ మిథశ్చాత్యంతసామ్యేపి విగ్రహాధికారయోర్వైష
మ్యం భగవన్నిత్యేచ్ఛాసిద్ధం। ప్రియమాణేత్యేతదనంతగరుడాదిష్వపి సమా
నం। అత్ర తు విజ్ఞాపనాధికారిణి వాక్యానతిలంఘనార్థం విశేషత ఉక్తం। ని
వేదితమితి పాఠే యదిత్యస్య తదితి ప్రతినిర్దేశోఽధ్యాహర్తవ్యః। న్యవేదితదితి
పాఠస్సమీచీనః। యద్వృత్తే పూర్వం ప్రయుక్తే హి తద్వృత్తమనంతరం ప్ర
యోక్తవ్యమేవేతి హ్యాహుః। సేనాపతినివేదితస్య భగవదభిమతత్వమా
హ తత్తథానుజానంతముదారవీక్షణైరితి। భగవతి తత్ప్రియజనే చ సర్వజ్ఞే
ప్యేవం నివేదనప్రేక్షణాదివ్యాపారాస్స్వచ్ఛందలీలాప్రవృత్తాః। యద్య
థా తత్తథేతి స్వరూపప్రకారయోరవిసంవాదార్థం। వీక్షణానాముదా
రత్వమైశ్వర్యవ్యంజకతయా సౌందర్యాదిగుణాశ్రయతయా త్వదాజ్ఞాభిప్రా
యగర్భతయానందప్రదత్వాచ్చ॥

హతాఖిలక్లేశమలైస్స్వభావత స్త్వదానుకూల్యై
కరసైస్తవోచితైః । గృహీతతత్తత్పరిచారసాధనై
ర్నిషేవ్యమాణం సచివైర్యథోచితం॥ ౪౩

తఏతేనిత్యసూరిషు ప్రధానతమాస్త్రయఉక్తాః అథతద్వ్యదసంఖ్యాత నిత్యసూరిసేవాప్రకారమాత్మనః ప్రాప్య త్వేనాభిసంధాయాహ॥ హతా ఖిలేతి ॥ అవిద్యాస్మితరాగద్వేషాభినివేశాః క్లేశాః తఏవమలత్వేనోచ్యం తే।తదవినాభూతత్రిగుణాత్మకప్రకృతిసంబంధోవా । అప్రతిబుద్ధాస్సర్వే క్లేశాక్రాంతాః ప్రతిబుద్ధాస్తుకతిపయక్లేశరహితాః ఉపాయతోనివృత్త నిఖిలక్లేశాస్తుముక్తాః నిత్యాస్త్వనాదినిర్ధూతనిఖిలక్లేశా ఇత్యభిప్రాయేణ స్వభావతఇత్యుక్తం। శ్రూయతేహి ‘తద్విష్ణోః పరమంపదగ్ సదాపశ్యం తిసూరయ’ఇతి। నహ్యేతస్మిన్ ప్రభావవిషయం సదాదర్శనకర్తౄణాం ముక్తానామభిధానాత్। నిత్యసర్వజ్ఞత్వాదేవక్లేశాదెరనవకాశః। ఏతే షాం ‘తద్విప్రాసోవిపన్యవోజాగృవాగ్ సస్సమింధత’ఇత్యుక్తమనుభ వప్రకారమభిప్రేత్యాహ త్వదానుకూల్యైకరసైరితి । త్వచ్ఛేషత్వాను రూపపారతంత్ర్యానుగుణకైంకర్యైకరుచిభిరిత్యర్థః । సదానుకూల్యే తిపాఠేప్యయమేవార్థః । తవోచితైః అనాదిసర్వజ్ఞత్వాప్రాకృతవిగ్ర హవత్త్వాదిభిస్త్వదనురూపైరిత్యర్థః। ఏతద్విశేషణత్రయమేతేషాంభగ వదాయత్తం।ఇదంచానంతగరుడాదీనామపిసమానం।పరిచారసాధనాని ఛత్రచామరాదిసేవోపకరణాని।సచివైః ఆసన్నసేవాయాంతత్తద్విభూ తివిశేషనిర్వహణేచనియుక్తైస్సూరిభిః । యథోచితం తత్తదధికారనియో గస్యసేవ్యాభిప్రాయస్యస్వాభావికదాసత్వస్యచానుగుణమిత్యర్థః॥

అపూర్వనానారసభావనిర్భరప్రబుద్ధయాముగ్ధవిదగ్ధలీల
యా।క్షణాణువత్క్షిప్తపరాదికాలయా ప్రహర్షయంతం
మహిషీంమహాభుజం॥ ౪౪

ఈదృశస్యభగవతస్సర్వేషు వ్యాపారేషు లక్ష్మీసామరస్య మభిప్రే త్యాహ॥ అపూర్వేతి ॥ ఉక్తంచ శ్రీవత్సాంకమిశ్రైః ‘‘క్రీడేయంఖలునా న్యథాస్యరసదాస్యాదైకరస్యాత్తయే’’తి । అపూర్వానవద్యనరసభావపరం

పరాయా ముత్తరోత్తరస్య విలక్షణత్వ మననుభూతజాతీయవదాశ్చర్య త్వంవా వివక్షితం। రసభావాః గాంధర్వవేదప్రదర్శితాఃఏరశ్శృంగారాద యఉత్సాహాదయశ్చ। తైర్నిర్భరప్రబుద్ధయా పరిభూతసంతతయా। మా ధుర్యవైదగ్ధ్యసంభేదాదద్భుతత్వమభిప్రేత్యాహ ముగ్ధవిదగ్ధలీలయేతి। లీ లాయానిత్యనిరతిశయత్వంవ్యనక్తి క్షణాణువత్క్షిప్తపరాదికాలయేతి। క్ష ణమేవపర్వతస్థానీయంకృత్వా తస్యాణుస్వాత్మత్వమపీకదేశ ఇతి కల్పితో యందృష్టాంతః। తద్వత్పరాదికాలక్షేప్తృకత్వాతిశయోక్తిః। చతుర్ముఖస్యా యుః పరో నామ కాలః। ఆదిశబ్దేనాసంఖ్యాతచతుర్ముఖాతికాంతికాలవ్యం జనం। స్మర్యతే హి "గంగాయాస్సికతా ధారా యథా వర్షతి వాసవే। శ క్యా గణయితుం లోకే న వ్యతీతాః పితామహాః" ఇతి। మహిషీం ప్రధానప త్నీం శ్రియమిత్యర్థః। ఉక్తం చ తస్యాః ప్రధానతమత్వే నైవమ్యం శ్రీవై కుంఠగద్యే "శేష శేషాశనాదిసర్వం పరిజనం భగవతస్తత్తదవస్థోచిత పరిచ ర్యాయామాజ్ఞాపయంత్యేతి। ప్రహర్షయంతమితి వర్తమాననిర్దేశస్సదా తనత్వాభిప్రాయః। ఏవం ప్రహృష్టాయాః ప్రియాయాః "బభూవ హృ ష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే" ఇత్యుక్తప్రకారేణ సర్వస్వభూత పరిష్వం గప్రదానానుగుణం ప్రియస్య భుజవైభవమాహ మహాభుజమితి। ఉక్తం హ్యేవ తారేతద్భుజమహత్త్వం "బాహుచ్ఛాయామవష్టబ్ధో యస్య లో కో మహాత్మన" ఇతి॥ ౪౪

అచింత్యదివ్యాద్భుతనిత్యయౌవనస్వభావలావణ్యమయా
మృతోదధిం। శ్రియశ్శ్రియం భక్తజనైకజీవితం సమర్థ
మాపత్సఖమర్థికల్పకం॥ ౪౫

అథ ప్రథమప్రస్తుతాం యౌవనవిశేషితాం సర్వచిత్తాకర్షకసముదాయ శోభాహాశ్రయణీయత్వభోగ్యత్వోపయికగుణవిశేషాంశ్చ సంకలయ్యా నుభవతి॥ అచింత్యేతి॥ అచింత్యం పరమయోగిభిరప్యపరిచ్ఛేద్యం కుతర్కై- రసంభావితమితి ప్రతిపత్తుమశక్యం చ। దివ్యం అప్రాకృతం। అద్భుతం సదానుభూతత్వేప్యదృష్టపూర్వవదాశ్చర్యావహం। నిత్యం కౌమారవా ర్ధకావస్థాపరిచ్ఛేదరహితం। యౌవనం లోకే బాల్యానంతర్యేణోపల

మణీయః కశ్చిద్రమణీయసంస్థానవిశేషః । సఏవస్వభావస్స్వాసాధారణ ధర్మోయస్యసఇత్యమృతోదధిర్విశేష్యతే। సచలావణ్యమయః లావణ్య ప్రచురః । లావణ్యంసముదాయశోభా । తదేతల్లక్షయంతి "భూయిష్ఠం తేజఏవాద్భిర్బహుళాభిర్మృదూకృతం । చక్షురానందజననంలావణ్యమి తికథ్యత" ఇతి । నిరతిశయభోగ్యమహత్తరాకారత్వమభిప్రేత్యామృతో దధిత్వోపచారః । అప్రాకృతామృతద్రవ్యాత్మకత్వంవావివక్షితం । పూ ర్వంకశ్శ్రీశ్శ్రియఇతి పరత్వస్థాపనాయోక్తం అత్రతుకైంకర్యోద్దేశ్యంని రతిశయభోగ్యంరూపంసపత్నీకమితిజ్ఞాపయితుమాహ శ్రియశ్శ్రియమి తి। భక్తజనైకజీవితం- భక్తజనానాంప్రధానజీవితం । "మచ్చిత్తామద్గత ప్రాణా" ఇత్యాదికమిహభావ్యం । యద్వాభక్తజనాఏవజీవితంయస్యస తథోక్తః । తథావిధప్రీత్యతిశయాదేవహిస్వయమేవాహ జ్ఞానీత్వాత్మై వమేమత"మితి "మమప్రాణాహిపాండవా" ఇతిచ । సమర్థంజగత్సృ ష్ట్యాదావిహాశ్రితానాంసామ్యభోగప్రదానే తద్విరోధినిరసనేచ ప్రతిబం ధకైః ప్రతిహంతుమశక్యమితిభావః। తథాచగీయతే "పరిత్రాణాయసా ధూనా"మిత్యాది । ఆపత్సఖం- ఆశ్రితానామాపది ప్రియసఖన్యాయేనస మానార్థతయావస్థితమిత్యర్థః। అర్థికల్పకమిత్యత్రస్వార్థేకః। అర్థినాం కల్పద్రుమవత్సర్వాపేక్షితప్రదమితియావత్ ।తథాచసూత్రితం * ఫలమ తఉపపత్తేరితి। యద్వా అర్థినఃకల్పద్రుమభూతాయస్యసోర్థికల్పకః। త దాహ "ఉదారాస్సర్వఏవైత" ఇతి । అథవా స్వయమర్థినః కల్పయతీ త్యర్థః । క్షేత్రజ్ఞానాంతత్త్వపురుషార్థాధికారదశాపిహిపరమపురుష కల్పితా॥ ౪౫

భవంతమేవానుచరన్నిరంతరప్రశాంతనిశ్శేషమనోర
థాంతరః । కదాహమైకాంతికనిత్యకింకరఃప్రహర్ష
యిష్యామిసనాథజీవితః॥ ౪౬

ఏవంప్రాప్యంభగవంతంయథావస్థితమనుసంధాయ తజ్జనితహర్ష ప్రకర్షేణ పరమపురుషార్థకాష్ఠాభూతంనిరుపాధికకైంకర్యమభ్యర్థయతే॥ భవంతమితి॥ ప్రాప్యప్రాపకత్వానుగుణప్రాప్తిసక్త సర్వాకారపరిపూర్ణ

మిత్యర్థః। కర్మాధీనసేవాంతరనివృత్తివ్యంజనార్థ ఏవకారః। ఏతేన “గీతిజ్ఞో యది యోగేన నాప్నోతి పరమంపదం। రుద్రస్యానుచరో భూత్వా తేనైవ సహ మోదత” ఇత్యాదిషూక్తం రుద్రాద్యనుచరణం చ వ్యవచ్ఛిన్నం భవతి। యద్వా ముక్తస్య స్వేచ్ఛయా భగవత్పరిజనసేవాపి తచ్ఛేషిపర్యంతత్వబుద్ధిపూర్వికేత్యభిప్రాయః। అనుచరః తత్తదవస్థోచితవృత్త్యా సేవమాన ఇత్యర్థః। అత్ర త్వవాంతరసేవావ్యావృత్త్యర్థం నిరంతరమిత్యుక్తం। ఉత్తరావధిరాహిత్యమభిప్రేత్య వర్తమానవ్యపదేశః। “ఏతమానందమయమాత్మానముపసంక్రమ్య ఇమాంల్లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్” ఇతి శ్రుతిశ్చానేన సూచ్యతే। అత్ర “కురుష్వ మామనుచరం। భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే। అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే। తవానుభూతిసంభూతప్రీతికారితదాసతాం। దేహి మే కృపయా దేవ న జానే గతిమన్యథా। సర్వావస్థోచితాశేషశేషతైకరతిస్తవ। భవేయం పుండరీకాక్ష త్వమేవైవం కురుష్వ మామ్” ఇత్యాదికమనుసంధేయం। ఏవంవిధకైంకర్యసిద్ధ్యర్థం ప్రయోజనాంతరేచ్ఛా త్వయైవ ప్రశమనీయేత్యభిప్రాయేణాహ ప్రశాంతనిశ్శేషమనోరథాంతర ఇతి। ఐకాంతికః ఏకస్మిన్నేవ నియతః। యద్యపి బ్రహ్మరుద్రప్రాప్త్యా క్వచిదపునరావృత్తిరుచ్యతే। తథాపి “బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పద” మిత్యుక్తన్యాయాత్ క్రమేణ ముక్తిపర్యంతత్వం తత్రాభిప్రేతం। అతోఽత్ర నిత్యశబ్దేన దేవతాంతరకింకరత్వవ్యవచ్ఛేదః। తదేతత్ “క్వాహమత్యంతదుర్బుద్ధి” రిత్యాదివాదినం పుండరీకం ప్రతి భగవతోక్తం “ఆగచ్ఛ వత్స భద్రం తే పుండరీక మహామతే। మహాప్రధారీ నిత్యాత్మా మమ పాదపరిగ్రహ” ఇతి। ప్రహర్షయిష్యామి త్వద్దాసభూతస్యైవ త్వత్ప్రహర్ష ఏవ ప్రధానం ప్రయోజనమితి భావః। ఏవం స్వాధీనస్వార్థకర్తృత్వభోక్తృత్వభ్రమరహితకైంకర్యప్రార్థనా కృతా భవతి। ఇతః పూర్వం త్వదుపేక్షయా త్వత్సనాథోఽపి నాథహీన ఇవాహమాసం ఈదృశం దైన్యం త్వత్సంకల్పాదేవ హి మే నివృత్తమిత్యభిప్రాయేణాహ సనాథజీవిత ఇతి॥ ౯౬

ధిగశుచిమవినీతం నిర్భయం మామలజ్జం పరమపురుష యోఽహం
యోగివర్యాగ్రగణ్యైః । విధిశివసనకాద్యైర్ధ్యాతుమత్యంత
దూరం తవ పరిజనభావం కామయే కామవృత్తః॥ ౪౭

నన్వేవం ముముక్షుదశాం మయాత్వం ప్రాపితోఽసి ఇయంచ మద్గుణా-
స్వాదగర్భతయా ముక్త్యవస్థాసమానా త్వయా సనకాదిభిరివ కంచిత్కా-
లమనుభూయతామితి భగవదభిప్రాయమాశంక్య స్వస్య కార్పణ్యస్థేమ్నే
విలంబాక్షమతయా త్వరాతిశయవ్యంజనాయ చ దుర్లభప్రార్థినం స్వా-
త్మానం నిందతి। ధిగశుచిమితి। ధిక్ఛబ్దయోగాద్ద్వితీయా। నను "ఆత్మనిందాత్మ
పూజా చే"తి స్వనిందాపి నిషిద్ధా । సత్యం, నతు సర్వత్ర యథాఖల్వాంజ-
నేయాదేః స్వప్రశంసా క్వచిద్గుణః తథాత్మనిందాప్యేతస్య స్వదైన్య ఖ్యా-
పనస్థల ఇతి। అశుచిం త్వత్కైంకర్యవిరుద్ధప్రకృతిసంస్పృష్టం తదనుబంధిక్లే-
శకర్మాదిదూషితం భావశుద్ధిరహితత్వేపి తద్వృత్తాం భావయంతం చ। నిత్యా-
స్సూరయశ్శాంతదోషా ముక్తాశ్చ త్వత్కైంకర్యయోగ్యాః తత్ర కోఽహ-
మితి భావః । నన్వాచార్యవంతమాత్మానం కిమర్థం నిందసీత్యత్రాహ అ-
వినీతమితి। యద్వాచార్యనియోగే మమావస్థానం స్యాత్ తదా తత్ర బంధువ-
త్ప్రహేణ ముక్తస్స్యాం, మమ త్వాచార్యవత్త్వేపి వినయాభావాత్తాత్త్వికవి-
డంబనాత్కైతవసంవృత్తేతి భావః । అయోగ్యస్య దుర్లభాభిలాషః "పరద్ర-
వ్యేష్వభిధ్యానం మనసానిష్టచింతనం । వితథాభినివేశశ్చ త్రివిధం మానసం
స్మృత"మితి స్మరణాదపచారస్స్యాత్, అతః పురోడాశార్థినశ్శ్వన ఇవ మే
దండనం తస్మాన్నేతి భయరహితోఽహమిత్యాహ నిర్భయమితి। నిర్దయమితి కే-
షాంచిత్పాఠే తు పరమభాగవతభోగ్యే పరమాప్తే విషం సంజనయంతమి-
త్యాచఖ్యుః । అత్రచ మదపరాధేన మదనుబంధినామపి ప్రత్యవాయో భ-
వేదితి జ్ఞాత్వాపి ప్రవృత్తతయా తేషు దయారహితోఽహమితి వ్యాఖ్యాతుం
యుక్తం। మాం అహంకారాదిగ్రస్తమిత్యభిప్రాయః। ఘటదాస్యాస్సార్వ-
భౌమమహిష్యంగాభిలాషవదనుచితవిషయోఽస్య మనోరథ ఇతి సద్భిః పరిహా-
స్యతామనుసంధాయాహ అలజ్జమితి సూరిసేవ్యస్య భగవతస్స్వసంబం-
ధానర్హోత్తుంగత్వం వ్యనక్తి పరమపురుషేతి । స్వస్య నిహీనతమత్వప్ర-

సిద్ధిమిదానీమపిదోషానువృత్తించాభిప్రేత్యాహయోహమితి। యోగిష్వప ర్యాః యోగివర్యాః భగవద్భక్తాః। తథాచగీయతే “యోగినామపిసర్వేషా”మిత్యాది। తేష్వగ్రగణ్యాః ప్రథమపరిగణనీయాః। విధిశివసనకాద్యైరిత్యుభయభావనానాం బ్రహ్మభావనానాంచ సర్వేషాం సంగ్రహః। ధ్యాతుమత్యంతదూరమిత్యనేన కింపునః ప్రాప్తుమితి వ్యజ్యతే। తవపరిజనభావం స్వానురూపానంతగరుడాద్యపరిమితపరిజనవత్తయానిరపేక్షం త్వాం ప్రతికింకరత్వం। యద్వా పరిజనక్రియాం సేవామిత్యర్థః। కామయే న మే కేవలం సంగమాత్రం కింతువిలంబాక్షమతీవ్రతమశ్రద్ధావానస్మీత్యాశయః। కామతోవృత్తం యస్యసకామవృత్తః। లోకశాస్త్రానాదరేణాపరిక్షిత యథేష్టకారీత్యర్థః। “లోకయాత్రాభయంలజ్జాదాక్షిణ్యం ధర్మశీలతా। పంచయత్రనవిద్యంతే నకుర్యాత్తేనసంగతి”మితి సర్వపరిత్యాజ్యోహం కథం త్వత్ప్రాప్త్యర్హ ఇతిభావః॥ ౪౭

అపరాధసహస్రభాజనం పతితంభీమభవార్ణవోద
రే। అగతింశరణాగతంహరే కృపయా కేవలమాత్మ
సాత్కురు॥ ౪౮

యద్యేవం స్వేనాపినిందనీయస్త్వమిదానీమప్యపరాధ్యసితర్హి కథం తేశీఘ్రంమత్ప్రాప్తిందాస్యామీత్యత్రానర్హస్యాపి మమాత్యంతదయనీయతయాత్వత్ప్రాప్త్యర్హతాపాదనమాత్మసాత్కరణంచ కృపయా స్వయమేవకుర్విత్యాహ॥ అపరాధేతి॥ ననిందితమితిపూర్వోక్తమత్రాపరాధసహస్రభాజనమిత్యనూదితం తచ్చక్షమాదిగుణైకభాజనేనత్వయా సర్వంక్షంతవ్యమితిసూచనార్థం। నిమజ్జతఇతిప్రాగుక్తం పతితమిత్యాదినాపునర్గృహీతం। జ్ఞానినాంపుణ్యఫలాంశోపిరాగానువృత్తిహేతుతయాత్యంతభయావహ ఇత్యభిప్రాయేణభీమశబ్దః। ఏవంసంసారస్యాతిఘోరత్వోక్త్యాపిస్వస్యపరప్రాప్తావిలంబాక్షమత్వంప్రతిష్ఠాప్యతే। అగతిమిత్యనేనప్రాగుక్తానన్యగతిత్వంస్థూణానిఖనన్యాయేనస్థిరీక్రియతే। శరణాగతమితిచపూర్వప్రయుక్తరక్షణవ్యాజానువాదః। తేనచ “శరణంచప్రపన్నానాంతవాస్మీతిచయాచతాం। ప్రసాదంపితృహంత్రాణామకుర్వంతిసాధ

